శ్రీః
మహాకవిశ్రీకాళిదాసవిరచితమ్

# కుమారసమ్భవమహాకావ్యమ్

రామోరావిరచితమృణాళినీవ్యాఖ్యాసహితమ్
వల్లభదేవవిరచితయా పఞ్జికయా సంస్కృతవ్యాఖ్యయా చ సముల్లసితమ్
చతుర్థః సర్గః



**రావి మోహనరావు,** M.Sc., M.A. (Sanskrit)
లెక్చరర్
4-103, I.L.T.D. Colony Extn., Kothapet, CHIRALA-523157



శ్రీః
మహాకవిశ్రీకాళిదాసవిరచితమ్
కుమారసమ్భవమహాకావ్యమ్
రామోరావిరచితమృణాళినీవ్యాఖ్యాసహితమ్
వల్లభదేవవిరచితయా పఞ్జికయా సంస్కృతవ్యాఖ్యయా చ సముల్లసితమ్
చతుర్థః సర్గః

ప్రథమ ముద్రణ: **21-8-2011 శ్రీ కృష్ణాష్టమి**
శ్రీఖరనామ సంవత్సరము శ్రావణమాసబహుళపక్షము
ప్రతులు : **500**
పేజీలు : **136**
వెల రూ. : **75/-**


Lecturer, V.R.S. & Y.R.N. College, Chirala-523157

**Residence:**
4-103, I.L.T.D. Colony Extn.,
Kothapet, CHIRALA - 523157
Cell :**94401 15411**

D.T.P.:
**MR LASER PRINTS**
Chirala
Cell: **9849976054**



Printed at :
**KARSHAK ART PRINTERS**
Hyderabad.



అస్మద్గురుభ్యోనమః

# పరితోషము

సకలవిద్యాధిదేవతయైన హయగ్రీవమూర్తియొక్క కృపామయహేషావిలాస మతని కవిత. అతని వాఙ్మయము సరస్వతీకరతలకలిత కచ్ఛపీనాద సముల్లాసము. అతని సూక్తి విశ్వసాహితీ కాంతామతల్లికా హృదయోద్గతదరహాసము. అతని పలుకు సనాతన కవితా సంప్రదాయరోచిస్సుల కావాసము. అతడే కవికులగురువు కాళిదాసమహాకవి. ఈ కవికోకిల నైకవిధ సుమధురకావ్యగానంతో సాహితీమర్మజ్ఞులకు వీనుల విందు గావించి వారిని పరవశులను చేసినది. ఈ కావ్యవిధాత సృజించిన కావ్యరత్నాలలో **"కుమారసంభవ"** కావ్యం అత్యంత విలక్షణము. పరమరమణీయము. లోకోత్తరమైన దేహసౌందర్యమును ప్రగాఢమైనభక్తిభావసౌందర్యమును పరిపూర్ణముగ ప్రదర్శించి, పరమేశ్వరసాన్నిధ్య ప్రాప్తి బాహిరసౌందర్యము సాధకము కాదు, **"భక్త్యా త్వనన్యయా శక్యః"** అనినట్లు భగవంతుడు ఆంతరసౌందర్యమునకు మాత్రమే వశ్యుడను ఉత్తమసందేశము నిచట కవి అందించినాడు. మహాకవి యితర రచనలన్నిటిలోను మానవీయమైన ఇతివృత్తం ప్రస్తుతంకాగా, ఇందులో కవికి ఇష్టదైవతములైన పార్వతీపరమేశ్వరుల కళ్యాణగాథ సరసరమణీయంగా చిత్రింపబడినది. ఈ విషయాన్నే కావ్యారంభంలో "దేవతాత్మా"



అని కవి స్వాపదేశంగా సూచించినట్లు భావించవచ్చు. ఈ కావ్యంలో దేవతా సంబంధమైన ఇతివృత్తాన్నే కథాంశంగా గ్రహించడం వలన ఉపనిషత్సిద్ధాన్తం కూడా ఆయా సందర్భాలలో పొందుపరచడం జరిగింది. ద్వితీయసర్గలో ఇంద్రకృత బ్రహ్మస్తుతి ఇందుకు ఉదాహరణము. ఈ విధంగా తృతీయ, పంచమ సర్గలలో యోగశాస్త్రవిషయాలు, ఇంకా అనేక విశేషాంశాలు ఈ మహాకావ్యంలో దర్శనమిస్తూంటాయి.

"కుమార సంభవ" ప్రథమసర్గ హిమాద్రివర్ణనంతో ప్రారంభమౌతుంది. క్రమంగా పార్వతీ ప్రాదుర్భావము **పుపోష లావణ్యమయాన్ విశేషాన్** అన్నట్లున్న పార్వతి బాల్యము, **"కామస్య పుష్పవ్యతిరిక్తమస్త్రమ్"** అన్నట్లున్న ఆమె అభినవతారుణ్యము నారదాగమనము పార్వతి శివపత్ని కాగలదని తెల్పుట, శివతపస్సు, పార్వతీ పరిచర్యయు మనోహరముగా వర్ణితములైనవి.

ద్వితీయసర్గలో ఇంద్రాదికృత చతుర్ముఖస్తుతి, తారకాసురుని దౌష్ట్యము, సేనాపతిసృష్టికై దేవతల ప్రార్థనము, శివపార్వతుల సుతుడే సేనాని కాగలడని బ్రహ్మ తెల్పడం కావ్యజ్ఞమనోరంజకములుగా నున్నవి.

తృతీయసర్గలో – శివపార్వతుల నడుమ అనురాగోదయానికై ఇంద్రుని ప్రేరణతో తపోవనంలో సపరివారుడైన మన్మథుని ప్రవేశము, వసంత ఋతువర్ణము, శివతపస్సు, పార్వతీ పరిచర్య, మదనుని బాణ ప్రయోగచిత్తవైకల్యము కామదహనము, రతిదేవి మూర్ఛయు సంగ్రథితములైనవి.

షట్చత్వారింశత్ (46) శ్లోకపరిమితమైన చతుర్థ సర్గలో పతిని కోలుపడిన రతి యొక్క విలాపము, మరణోద్యమము, మఱియు **"స్వస్యైవావినయస్య ఫలమనేనానుభూయతే"** యన్నట్లు పూర్వము మన్మథుడు గావించిన అకృత్యమునకు ఫలితముగా శాపవశమున దగ్ధమగుటను దైవకృపచే మఱల పునరుజ్జీవితుడు కాగలడను అశరీరవాణీసందేశముతో దేహత్యాగ ప్రయత్నవిరమణమును కూర్చబడినవి.

**చతుర్థసర్గ సారాంశము** – నిజకాంతుడైన మదనునిమృతిచే దుఃఖవివశురాలై మూర్ఛనొందిన రతిదేవి విధివశమున నవవైధవ్యమును అనుభవించుటకా యన్నట్లు తెప్పటిల్లినదనుటతో చతుర్థసర్గము ఆరంభమైనది. (ఇచట "నవవైధవ్య"

మనుటవలన పూర్వములేని వైధవ్యము క్రొత్తగా ప్రాప్తించుటచే సహింపశక్యముగానిది అను స్వారస్యము తోచుచున్నను, ఆ అర్థవిశేషము "అసహ్యవేదనమ్" అను విశేషణముచే వాచ్యమగుచున్నది కావున, ఈ వైధవ్యము విలక్షణమైనదనుట కవి హృదయమని తోచుచున్నది. వైలక్షణ్యమేమనగా ఆ లోకమున విగతభర్తృకలైన వారి వైధవ్యము, వ్యథ మఱల తీఱనివి. కాని, ప్రకృతిలో రతీదేవికి ఏర్పడిన వైధవ్యం తాత్కాలికదుఃఖానుభవం కోసం విధి కల్పించినది మాత్రమే. అచిరకాలమున స్మరుడు పునరుజ్జీవితుడు కాగా, రతికి వైధవ్యభావన తొలగిపోవును. ఇట్టి వైధవ్యం లోకవిలక్షణమైనందున నవవైధవ్యమైనది).

మూర్ఛనుండి మేల్కొన్న రతి భర్తృమరణమును ఎఱుగక, నాథా! జీవించి యుంటివా! యనుచు దిక్కులు చూచినది. ఆమెకు అచట కన్పించినది హరకోపానలభస్మము మాత్రమే. ఆమె దుఃఖము కట్టలు త్రెంచుకొన్నది. నేలపై పొర్లుచు తనకాంతుని తలచుకొని పలువిధములుగా విలపించినది. ప్రాణేశా! లోకోత్తరసుందరుడవైన నీవు మరణించినను కఠినాత్మురాలనై నేను జీవించియే యున్నాను. నీకు అధీనురాలనైన నన్ను విడచి ప్రేమను మఱచి వెడలినావు. మన మధ్య ఇసుమంతయు భేదభావము లేదుగదా! నా కెందుల కగపడవు! మన శృంగారలీలావిలాసములను మఱచినావా!

కాంతుడా! "నా (మన్మథుడు) – హృదయమున నీవు (రతి) ఉన్నా"వని నీవు పలుకుట అసత్యమే సుమా! ఈ రతికి ఆధారమైన నీవు లేకున్నను ఈ రతి ఇట్లే యున్నదికదా! జనులకు సుఖము కలుగజేయు వాడవగు నీ మార్గమును అనుసరించి నేనును వచ్చుచున్నాను. నీవు లేకున్నచో లోకమున కాంతలను తమ ప్రియులతో కలుపగలవారెవ్వరు? నీ మిత్రుడైన చంద్రుడును నీవు లేవని తెలిసి శుక్లపక్షమునందు సైతము కృశత్వమును శీఘ్రముగా వీడలేకపోవుచున్నాడు. నీ అల్లెత్రాడైన భ్రమరపంక్తి నా దుఃఖమును చూచి తానును రోదించుచున్నది. నీవు మఱల సుందరాకృతితో లేచిరమ్ము. మన ఏకాంతమునందలి నీ వేడికోళ్లు, ఆలింగనములు, శృంగార క్రీడలును గుర్తుకు వచ్చి నా దుఃఖము ఉపశమింపకున్నది. నీవు నా కొనర్చిన పుష్పాలంకృతి ఇంకను ఇటులనే యున్నది. నా పాదములకు పారాణి పూర్తిగా అలంకరింపక మునుపే దేవతలు నిన్నీ కార్యమున పనిచినారు. మఱలివచ్చి పూర్తి గావింపుము.





సుందరాంగా! స్వర్గమునందప్సరఃకాంతలు నిన్ను మోహపఱచకమునుపే నేనును అగ్నిప్రవేశము చేసి నీదరికి చేరగలను (తృతీయసర్గమునందు **"పతఙ్గవత్ వహ్నిముఖం వివిక్షుః"**–64 అని మన్మథుని ధనురారోపణ సందర్భమున అగ్నిలో పడబోవు శలభమునుగా కవి స్మరుని ఉపమించినాడు. ఇచట రతిదేవికూడా పతఙ్గవర్త్మనా – శలభమార్గముననే అనగా అగ్నిలో ప్రవేశించి వత్తుననుట ద్వారా ఆమె యొక్క పతిమార్గానువర్తనము సూచింపబడుట గమనింపదగియున్నది)

నేనిప్పుడే నీ వద్దకు చేరుకొన్నను మన్మథుని విడచి రతి క్షణకాలము బ్రతికియే యున్నదను అపవాదము స్థిరముగా నుండిపోవును కదా! అయ్యో!

ప్రియతమా! నీవు ధనుర్బాణములను సవరించుకొనుచు చూచిన క్రీగంటి చూపులను మఱువలేకున్నాను. నీకు పుష్పశరములను కూర్చు ప్రియసఖుడగు వసంతుని కూడా హరుడు కోపంతో నీ వెంట పంపెనా? ఇట్లనుచుండగనే ఆమెనోదార్చుటకు వసంతుడు ఆమె ఎదుటకు వచ్చి నిలిచినాడు. అతడిని చూచి రతిదేవి మిక్కుటమైన దుఃఖముతో గుండెలు బాదుకొనుచు విలపించినది. వసంతుడా! గాలికి వెదజల్లబడునట్లు బూడిదయైన నీ మిత్రుని స్థితిని చూచినావా! ప్రియతమా! నీ స్నేహితునికి దర్శన మిమ్ము. నీ జగజ్జయమునకు సహచరుడైన వసంతునకు దర్శన మిమ్ము. వసంతుడా! దీపశిఖవంటి నీ మిత్రుడు లేని నేను మసిబాఱిన వత్తివలె మిగిలియున్నాను. విధి నన్ను చంపకవిడచినను నా సగమైన కాముని మరణము నాకును మరణమే. వసంతా! బంధుకార్యముగా తలచి నాకు చితిని పేర్చి నన్ను నా భర్తవద్దకు చేర్చుము. చంద్రునితో వెన్నెల, మేఘముతో మెఱపు కలియుచున్నవి. భర్తను భార్య చేరుట అచేతనములు కూడ ఎఱిగినదే కదా! నేనగ్ని ప్రవేశముచేయుదును. చితిని పేర్చుము. పిమ్మట త్వరగా దహింపబడి నీ మిత్రుని చేరుటకై దక్షిణపవనములు వీచునట్లు చేయుము. నీవు మా యిరువురికిని నివాపాంజలిని ఒకటిగనే విడువుము. మేము కలసియే దానిని స్వీకరింతుము. అనంతరము శ్రాద్ధక్రియలలో నీవు నీ మిత్రునికి ప్రీతికరమైన సహకారమంజరిని సమర్పించుము – అనుచు దేహపరిత్యాగమునకు సంసిద్ధురాలైన రతిదేవిని ఉద్దేశించి ఆకాశవాణి యిట్లు పలికినది. – ఓ మారపత్నీ! నీకు అచిరకాలముననే భర్తృసాంగత్యము మఱల లభించును. అతడిట్లు హరనేత్రాగ్నిలో మిడుతవలె దగ్ధమగుటకు కారణమును తెల్పెదను. వినుము. నీ వల్లభుడు పూర్వమొకప్పుడు

చతుర్ముఖునకు చిత్తవికారమును కలిగించి తన కుమార్తెయైన సరస్వతియందే వ్యామోహము కలుగునట్లు సుమబాణప్రయోగమును గావించినాడు. వెనువెంటనే విధాత స్వాంతమును నిగ్రహించుకొని తన మనోవికారమునకు కారణమైన మారుని శపించినాడు. ఆ శాపఫలితమిది. ఆ సమయమున సమీపమందున్న ప్రజాపతి కాముని దయ చూడుమని విరించిని ప్రార్థించినాడు. బ్రహ్మ దయతో అపుడు, శివపార్వతుల పరిణయానంతరము శివుడు ఇతడిని పునరుజ్జీవింపజేయగలడని శాపావసానమును అనుగ్రహించినాడు. కనుక, ఓ సుందరీ! నీకు మఱల ప్రియ సంగమం కలుగబోవుచున్నందున నీవు దేహత్యాగప్రయత్నమును విరమింపుము. నిన్ను రక్షించుకొనుము – అని యిట్లు అశరీరవాణి పలుకగా ఆ అదృశ్యశక్తిపై విశ్వాసముతో మారసతి ఆత్మత్యాగప్రయత్నము నెట్లో విరమించినది. వసంతుడును ఆమెను సార్థకములైన సాంత్వనవచనములతో ఓదార్చినాడు. రతిదేవి తన ప్రియుని శాపావసానమునకై ఎదురు చూచుచు విషణ్ణహృదయురాలై కాలమును గడిపినది. అపుడామె సాయం సమయమునకై ప్రతీక్షిస్తున్న పగటి చంద్రరేఖవలె అప్రకాశముగ నున్నది. ఈ నిరీక్షణవర్ణనముతో చతుర్థసర్గము ముగిసినది.

త్రిలోకనాథుడైన చంద్రశేఖరుడు ప్రాకృతమైన సౌందర్యమునకు ఆకృష్టుడుగాడు, ఆయన **'మనోమయః'** ఇత్యాదిగా శ్రుతిప్రవచించినట్లు విశుద్ధచిత్తప్రాప్యుడు. భక్తిమాత్రసులభుడు అను మనోగతమును కవికులగురువు వెనుక తృతీయ సర్గ చివర **"వ్యర్థం సమర్థ్యలలితం వపురాత్మనశ్చ** శ్లో॥ 75 అని, రాబోవు పంచమసర్గలోకూడా ఆరంభమునందే" **పినాకినా భగ్నమనోరథా సతీ నినిన్ద రూపం హృదయేన పార్వతీ** శ్లో॥1 అనియు తెలిపినాడు. భౌతికమైన శారీరకసౌందర్యం అనిత్యమని నశ్వరమని దేవదేవుని సాన్నిధ్యాన్ని పొందడానికి అది ఎంత మాత్రము సాధకం కాదని, అలా సాధింపబూనడం అవివేకమని అది ఫలేగ్రహి కాకపోవడమే గాక ఆత్మనాశం కలుగుతుందని దుఃఖహేతువు కాగలదని ఈ చతుర్థసర్గమువలన అవగతమగుచున్నది. అకృత్యకరణము వలన కలిగిన దుఃఖమును తొలగించి మఱల ఆత్యంతికమగు ఆనందమును ప్రసాదించు దయాశీలుడు పినాకపాణియే యను ప్రగాఢవిశ్వాసమును ప్రకటమగుచున్నది.

ఈ సర్గమున ఆద్యంతము ఆవిష్కృతమగుచున్న కరుణరసము సరసహృదయుల హృదయకోశములను తాకి కనుగొలకుల నీరు చిప్పిలజేయును.



**శ్లో॥ క్వ ను మాం త్వదధీనజీవితాం వినికీర్య క్షణభిన్నసౌహృదః।**
**నలినీం క్షతసేతుబన్ధనో జలసం ఘాత ఇవాసి విద్రుతః॥ – 6**

కట్టలు త్రెంచుకొని జలరాశి ప్రవహించినపుడు అందు తేలియున్న పద్మలత విసరివేయబడినట్లు స్నేహబంధమును త్రెంచుకొని మన్మథుడు పోవగా తదధీనురాలైన రతి తానేమైనదో తెలియకున్న దనుట మనసును విచలితం గావిస్తుంది.

కామునితోడి యేకాంతవిలాసములు స్మరణకు వచ్చి ఆమె హృదయమును కల్లోల పఱచుచున్నవట. పత్ని పతిలో భాగము గనుక విధి అర్ధ భాగమైన కాముని వధించగా తానును మరణించినట్లేనని రతిభావించును.

శ్లో॥ మదనేన వినా కృతారతిః క్షణమాత్రం కిల జీవితేతి మే।
వచనీయ మిదం వ్యవస్థితం రమణ! త్వామనుయామి యద్యపి॥ 21

ప్రియతమా! నేనగ్నిప్రవేశము చేసి నిన్నిపుడే చేరికొందును. అయినను రతి తన పతిమరణించిన తరువాత కూడా క్షణకాలం జీవించియే యున్నది సుమా! అను లోకనిందను పొందుదునుగదా! అయ్యో! అనుచు పతిని విడచి క్షణకాలమైనను రతిదేవి నిలువలేకపోయిదనుట ఏ సరసచిత్తమును ద్రవింపజేయదు.

ఏతాదృశసాంద్రకరుణరససంఘటనంలో కూడ కవిరాజుయొక్క సహజమగు ఉపమావిలసనవైదగ్ధ్యము విద్వద్వరుల మానసములకు కౌతుకమును పంచును.

**శ్లో॥ శఫరీం హ్రదశోష విక్లబాం ప్రథమా వృష్టిరివాన్వకమ్పయత్॥ 39**

దేహత్యాగమునకు సిద్ధపడుచున్న రతిదేవికి ఆకాశవాణి వినబడినది. అది, సరసులోని జలమంతయు ఎండిపోవునని భీతిచెందుచున్న మత్స్యకన్యకు తొలకరివానవలె ఆమెకు హర్షమును కలిగించినది. పతివిహీనయై మోడువారినట్లుగా రతిదేవి యొక్క దైన్యస్థితిని తెలుపుచు ఆమెకు పునరుజ్జీవనము కలుగబోవుచున్నదని తెలుపుటకు ప్రథమవృష్టిదృష్టాంతమును నిబంధించుట మిగుల మనోరమము. తదుపరి, రతీ! నీకు మఱల భర్తృసమాగమము కలుగును కావున. శరీరత్యాగయత్నమును విడచి, దేహమును కాపాడుకొమ్మని అశరీరవాణి పలుకుచు

**శ్లో॥ రవిపీతజలా తపాత్యయే పునరోఘేన హి యుజ్యతే నదీ – 44**

వేసవిలో నీరెండినది గ్రీష్మర్తువు గడచిన వెంటనే మఱల జలప్రవాహముతో కూడునుగదా! అను దృష్టాంతము ద్వారా భావ్యర్థమును సూచించుట కదు రమ్యము.

రతిదేవి పతిని విడచి క్షణకాలమైనను నిలిచియుండలేనిది. తత్సహధర్మచారిణి. పతివ్రత. వారి అన్యోన్యమును అపృథగ్భావమును కవి తెలియజెప్పిన తీఱు ప్రసిద్ధము లోకాద్భుతమును –

**శ్లో॥ శశినా సహ యాతి కౌముదీ సహ మేఘేన తటిత్ప్రలీయతే।**
**ప్రమదాః పతివర్త్మగా ఇతి ప్రతిపన్నం హి విచేతనైరపి॥ –33**

–వసంతుడా! వెన్నెల చంద్రునితోనే కలసి వెళ్లును. మెఱపుతీగె మేఘమందే లీనమగును. ఇట్లు సతులు పతిననుసరించియే యుందురని అచేతనములను చూచినను తెలియునుగదా! ఇచట కౌముదీ విద్యుల్లతా దృష్టాంతములతో అనపాయిత్వమును బోధించుట కవివరుని లోకశాస్త్రాద్యవేక్షణమును ప్రస్ఫుటము గావించుచున్నది.

ఇచట నొక విశేషము ముచ్చటించుకొనదగియున్నది. కవికులగురుని సాహితీకళావైభవము తరువాతి కాలపు సాహిత్యప్రపంచమున మార్గదర్శకమై వెలుగులీనుచున్నదనుటలో అతిశయోక్తి ఇసుమంతయు లేదు. అట్లే, మహాకవి “అథవా కృతవాగ్ద్వారే వంశేఽస్మిన్ పూర్వసూరిభిః” అని తాను స్వయముగా చెప్పుకొన్నది రఘువంశకావ్య విషయమే అయినను, మనం పలుచోట్ల పూర్వకవుల సత్కావ్యసంప్రదాయముల అనుసరణమును కనగలము. ఇవి వైదగ్ధ్యప్రకర్షచే ప్రకరణానుగుణముగ నవ్యతను పొంది సహృదయహృదయాహ్లాదకములగు చుండును.

శ్లో॥ అనుచరతి శశాఙ్కం రాహుదోషేఽపి తారా
పతతి చ వనవృక్షే యాతి భూమిలతా చ!
త్యజతి న చ కరేణుః పఙ్కలగ్నం గజేన్ద్రం
వ్రజతు చరతు ధర్మం భర్తృనాథా హి నార్యః॥ ప్రతిమానాటకమ్–1

భాసమహాకవి రచించిన ప్రతిమానాటకములోని ప్రథమాంకములో వనవాసమునకు బయలుదేఱుచున్న రాముడు సీతను వారించుచున్న సందర్భమునకు లక్ష్మణుని వచన మిది – “చంద్రబింబం రాహుగ్రస్తమైనా తార





అనుసరించిపోవును గదా! వనితకు భర్తయే రక్షకుడు కావున, సీతమ్మను నీతో అడవికి రానిమ్ము. తన పాతివ్రత్యధర్మమును పాటింపనిమ్ము” – ఇచట భాసకవి సోదాహరణముగా చూపిన పాతివ్రత్యధర్మమును కాళిదాసమహాకవి క్రింది రెండు శ్లోకాలలో స్మరింపజేస్తాడు.

**శ్లో॥ అనపాయిని సంశ్రయద్రుమే గజభగ్నే పతనాయ వల్లరీ – 4.31**

**శ్లో॥ శశినా సహ..... ప్రతిపన్నం హి విచేతనైరపి” – 4.33**

భాసకవి పూర్వశ్లోకంలో క్రమంగా అచేతన, అచర, చరములలో చూపిన అనపాయిత్వమును, కుమార సంభవకర్త ఇచట “విచేతనైరపి” అని సోదాహరణంగా స్పష్టం చేయడాన్ని గమనింపవచ్చు.

మఱికొన్ని మనోహరములైన ఔపమ్యనిరూపణఘట్టాలు.

**శ్లో॥ గత ఏవ న తే నివర్తతే స సఖా దీప ఇవానిలాహతః।**
**అహమస్య దశేవ పశ్య మామవిషహ్యవ్యసనేన ధూమితామ్॥ – 30**

**శ్లో॥ నవపల్లవసంస్తరే యథా రచయిష్యామి తనుం విభావసౌ – 34**

**శ్లో॥ అశనేరమృతస్య చోభయోర్వశినశ్చామ్బుధరాశ్చ యోనయః॥ –43**

**శ్లో॥ శశిన ఇవ దివాతనస్య లేఖా కిరణపరిక్షయధూసరా ప్రదోషమ్॥ 46**

ఆకాశవాణి మన్మథుని శాపావసానమునుగూర్చి తెలిపే సందర్భంలో కవి పలికిన “వశినశ్చామ్బుధరాశ్చ యోనయః” అను సూక్తి శాపవిముక్తిని అనుగ్రహించిన చతుర్ముఖుని ఉద్దేశించినది కావచ్చు. సంజీవినీ వ్యాఖ్యలో శివపరంగా అన్వయింపబడినది.

ఈ క్రమంలో మహాకవి యొనర్చిన పలువిలక్షణ వ్యాకరణప్రయోగములను చూడగలము.

1) హరకోపానలభస్మ శ్లో. 3

హరకోపానలాత్ భస్మ – పంచమీతి యోగవిభాగాత్ సమాసః॥
హరకోపానలస్య భస్మ – శేషషష్ఠ్యా వా “సుప్సుపా” ఇతి వా సమాసః॥

2) స్థలీ – శ్లో. 4
స్థలీ అకృత్రిమా చేత్, స్థలాఽన్యా జానపదేతి అకృత్రిమార్థే జీష్.
"వనస్థలీ శ్లోకలతాప్రతానా" – రామా సుం. 41.20

3) స్మర! సంస్మృత్య న శాన్తిరస్తి మే. శ్లో–17

అత్ర "మే" ఇతి పదస్య విశేషణతయా "విలపన్త్యా" ఇత్యస్య అధ్యాహారేణ, సంస్మృత్య విలపన్త్యాః మే ఇత్యన్వయ లాభాత్ సంస్మరణ విలాపక్రియయో రేకకర్తృకత్వసిద్ధ్యాపూర్వకాలిక క్రియావాచకస్య స్మరతేః " సమానకర్తృకయో" రితి క్త్వా ప్రత్యయో ల్యబాదేశశ్చ సిద్ధ్యతీతి సర్వం సమఞ్జసమ్। అత్ర శాన్త్యభావస్య విహితత్వాత్ తద్ధేతుతయా "విలపన్త్యా" ఇత్యస్య అధ్యాహారోఽపి యుక్త ఏవేతి॥

4) ప్రియసఙ్గమమ్ శ్లో. 44
ప్రియస్య సఙ్గమః యస్య తత్ వ్యధికరణబహువ్రీహిః

ఇక ఛందో బంధాల విషయానికి వస్తే మహాకవి వర్ణ్యములైన రసభావాలకు అనుగుణములైన వృత్తాలను స్వీకరించి వాటిని పోషించిన విధానం అత్యద్భుతమై పరమామోదకరమై కవిలోకమార్గదర్శకమై అలరారుచున్నది.

భక్త కవులెందరో తమ ఇష్టదేవతలను ప్రస్తుతిస్తూ సుప్రభాతములను పాడినారు. వాటిలో ఒకటి రెండు మినహా మిగిలిన వన్నీ వసంతతిలకావృత్తంలోనే రచింపబడియున్న విషయం విదితమే. ఈ వరవడిలో మొదటిది ప్రతివాది భయంకరం అణ్ణన్ విరచితమైన "శ్రీవేంకటేశ్వరసుప్రభాతస్తోత్రమ్" అని చెప్పవచ్చు. ఇది విద్వజ్జనమనోరంజకమై భక్తకోటికి వినినంతనే ఆనందమును కలిగించుచున్నది. భవ్యమైన ఈ సుప్రభాతస్తోత్రాన్ని వసంతతిలకావృత్త ప్రచురంగా రచించడంలో అణ్ణన్‌గారికి మార్గదర్శి కాళిదాసమహాకవియేనని భావింపవచ్చు. రఘువంశ మహాకావ్యంలోని పంచమసర్గలో చివర స్తుతిపాఠకులు అజుని నిద్ర మేల్కొల్పిన రీతి పరమరమణీయము. ఈ సందర్భములో కవి ప్రత్యేకముగా వసంతతిలకావృత్తాలను స్వీకరించడం తరువాతి వారికి పథోనిర్దేశం చేసింది. మహాకవిని ఆచార్యస్థానంలో నిలిపినది.

కుమారసంభవ చతుర్థసర్గలో ప్రకృతమైన రతివిలాపమును తదనుగుణమైన "వియోగినీ" వృత్తములో వర్ణించుట అత్యంత సముచితము. మఱియు సర్గాంతంలో





రతిదేవిని వసంతుడు ఓదార్చు సందర్భంలో శ్లోకాన్ని వృత్తనామౌచిత్యాన్ని స్ఫురింపజేస్తూ వసంతతిలకావృత్తంలో రచించడం బుధవరుల చిత్తముల నుత్తేజపఱచును. అట్లే రతి భర్తృసమాగమానికై ఆసక్తితో ప్రతీక్షిస్తున్నట్లు వర్ణించే చివరి శ్లోకాన్ని పుష్పితాగ్రావృత్తంలో అందించడం కూడా మహాకవి కవితావైదుష్యప్రతిభకు నిదర్శనము.

బహుముఖములు అనర్ఘములు అయిన అనేక విశేషాంశాలతో విలసిల్లే కుమారసంభవకావ్యాన్ని అధ్యయనం చేయగలగడం మహాభాగ్యం. సాహితీ మర్మజ్ఞులైన పలువురు పండితప్రవరులు బహుభాషలలో వెలయించిన వ్యాఖ్యలే ఈ కావ్యరత్నప్రభలవైభవాన్ని చాటి చెబుతున్నాయి. ఆ క్రమంలో మిత్రమణులు శ్రీరావి మోహనరావుగారు మనదగు తెనుగున కుమారసంభవ కావ్యానికి అతివిపులముగ మృణాలినీవ్యాఖ్యానాన్ని అందించబూనడం మిగుల హర్షణీయం.

ఈ మృణాలినిలో అనేక శ్లోకవ్యాఖ్యారవిందాలు విరబూచును. ప్రతి శతపత్రంలోను నైకముఖములైన దళాలు విపులవిషయస్నిగ్ధములై రక్తిమతో సరసుల నాకట్టుకొనును. వ్యాఖ్యావిధానం, విషయవర్గీకరణం సర్వజనోపకారకాలు, విద్యార్థినాం కిముత? వ్యాకరణ విశేషాంశాలను, నిఘంటువులను, వాటితోబాటు ప్రయోగాంతరాలను సమ్ముఖానికి తేవడం మిక్కిలి శ్రమసాధ్యం.

ఈ విషయంలో శ్రీమోహనరావుగారి కృషి బహుధా ప్రశంసనీయం. ఇట్టి విపులతర వివరణములతో మహాకవి యొక్క సాహితీసుధను సుస్వాదం చేస్తున్నందుకు వీరికి ఆంధ్రులందఱు కృతజ్ఞులై యుంటారనడంలో సంశయం లేదు. ఈ మహాకార్యాన్ని మిక్కిలి శ్రద్ధతో చేబట్టి, వ్యాఖ్యావిధానాన్ని కొత్తపుంతలు తొక్కించి, అధ్యయనానుకూలంగా మలచి, సర్వజనామోదమును పొందిన శ్రీ రావి మోహనరావుగారికి అభినందనములను తెలుపుకొంటున్నాను. కుమారసంభవ కావ్యవ్యాఖ్యానం పూర్తి కావించడంతో బాటు వీరి లేఖినీలతికనుండి మరెన్నో సద్గ్రంథశతపత్రాలను వెల్లివిరియజేయాలని వాగ్దేవతను ప్రార్థిస్తున్నాను.

ఇట్లు
బుధజనవిధేయుడు
కందాళ లక్ష్మీనారాయణ



గోదాదేవి
పాదపద్మములకు
భక్తితో సమర్పితము



శ్రీః
ఓం కుమార శ్రీగురవే నమః



## మృణాళినీ వ్యాఖ్యానమున

ఉదాహరింపబడిన విషయములకు సంబంధించిన
ఆయా గ్రంథ రచయితలకు, వ్యాఖ్యానకారులకు నమస్సుమాంజలులు.

❀

ఇట సహకరించిన డా॥ వుయ్యూరు లక్ష్మీనరసింహారావుగారు,
డా॥ ఈ.ఏ. శింగరాచార్యులుగారు, డి. పాపిరెడ్డిగారు, సి. సుబ్బారావుగారు,
మేళ్ళచెర్వు వేంకట సుబ్రహ్మణ్యశాస్త్రిగారు, ఇప్పగుంట సాయిబాబాగారు,
డా॥ ముళ్ళపూడి విశ్వనాథశాస్త్రిగారు, మహామహోపాధ్యాయ శ్రీ పుల్లెల
శ్రీరామచంద్రుడుగార్లకు మఱియు అడిగిన వెంటనే "పరితోషము" అందించిన
డా॥ కందాళ లక్ష్మీనారాయణగారు, గరిమెళ్ళ సోమయాజులుశర్మగారు,
ప్రియమిత్రులు శ్రీ కె. అరవిందరావు, IPS, DGP(Retd) గార్లకు

❀

నా ఆరాధ్యదైవమైన
మహాయోగి శ్రీ అరవిందభగవానుడు,
వారి అర్ధభాగమైన మృణాళినీదేవికి నమస్కరిస్తూ.....

❀

శ్లో॥ నాహం మన్యే సువేదేతి - నో న వేదేతి వేద చ।
యో నస్ తద్వేద తద్వేద - నో న వేదేతి వేద చ॥

– కేనోపనిషత్ 10

ఓం శాన్తిశ్ శాన్తిశ్ శాన్తిః

**- రా మో రా**

శ్రీః

# కుమారసమ్భవమహాకావ్యమ్

## 'రతివిలాపవర్ణనమ్' నామ చతుర్థః సర్గః

**అవతారికా:–** మూర్ఛితా రతిరిత్యుక్తమ్ –సమ్ప్రతి తద్వృత్తాన్తమేవాహ! రతిమూర్ఛిల్లినదని చెప్పినాడు – ఇప్పుడు ఆమె వృత్తాంతమునే చెప్పుచున్నాడు.

– రతి విలాపవర్ణనమ్ –

**శ్లో॥ అథ మోహపరాయణా సతీ**
**వివశా కామవధూర్విబోధితా।**
**విధినా ప్రతిపాదయిష్యతా**
**నవవైధవ్యమసహ్యవేదనమ్ ॥** 1

**పదవిభాగము:–** అథ, మోహపరాయణా, సతీ, వివశా, కామవధూః, విబోధితా, విధినా, ప్రతిపాదయిష్యతా, నవవైధవ్యమ్, అసహ్యవేదనమ్।

**అన్వయక్రమము:–** అథ మోహపరాయణా సతీ వివశా కామవధూః అసహ్యవేదనం నవవైధవ్యం ప్రతిపాదయిష్యతా విధినా విబోధితా।

**ప్రతిపదార్థము:–** అథ – పిమ్మట, (మూర్ఛపోయిన అనంతరమున), మోహపరాయణా – మోహపరశురాలైనట్టియు, సతీ – పతివ్రతయు, వివశా – నిశ్చేష్టురాలు అగు, కామవధూః – రతిదేవి, అసహ్యవేదనమ్ – సహింపరాని దుఃఖము గలదియగు, నవవైధవ్యమ్ – నవవైధవ్యమును, ప్రతిపాదయిష్యతా – అనుభవించునట్లు చేయుచున్న, విధినా – దైవముచేత, విబోధితా – మూర్ఛనుండి తేరుకొనజేయబడినది..

**తాత్పర్యము:–** పిమ్మట, మోహపరశురాలైనట్టియు, ప్రతివ్రతయు, నిశ్చేష్టురాలు అగు **రతిదేవి,** సహింపరాని దుఃఖముగలదియగు నవవైధవ్యమును అనుభవించునట్లు చేయుచున్న దైవముచేత మూర్ఛ నుండి తేరుకొనజేయబడినది.





**విభక్తులు/క్రియలు:–** 1. అథ – అవ్యయము, 2. మోహపరాయణా – **మోహపరాయణా** మోహపరాయణే, మోహాపరాయణాః, ఆకారాన్త స్త్రీలింగ మోహపరాయణాశబ్దము. ప్ర.ఏ. 3. సతీ – **సతీ**, సత్యౌ, సత్యః, ఈకారాన్త స్త్రీలింగ సతీశబ్దము, ప్ర.ఏ., 4. వివశా – **వివశా**, వివశే, వివశాః, ఆకారాన్త స్త్రీలింగవివశాశబ్దము, ప్ర.ఏ., 5. కామవధూః – **కామవధూః**, కామవధ్వౌ, కామవధ్వః, ఊకారాన్త స్త్రీలింగ కామవధూ శబ్దము, ప్ర.ఏ., 6. అసహ్యవేదనమ్ – **అసహ్యవేదనమ్**, అసహ్యవేదనే, అసహ్యవేదనాని, అకారాన్త నపుంసకలింగ అసహ్యవేదన శబ్దము, ద్వి.ఏ., 5. నవవైధవ్యమ్ – **నవవైధ్వవ్యమ్,** నవవైధవ్యే, నవవైధవ్యాని, అకారాన్త నపుంసకలింగ నవవైధవ్యశబ్దము, ద్వి.ఏ., 8. ప్రతిపాదయిష్యతా – **ప్రతిపాదయిష్యతా**, ప్రతిపాదయిష్యద్భ్యామ్, ప్రతిపాదయిష్యద్భిః, తకారాన్త పుంలింగ ప్రతిపాదయిష్యత్ శబ్దము. తృ.ఏ., 9. విధినా – **విధినా,** విధిభ్యామ్, విధిభిః, ఇకారాన్త పుంలింగ విధిశబ్దము, తృ.ఏ., 10, విబోధితా – **విబోధితా**, విబోధితే, విబోధితాః, ఆకారాన్త స్త్రీలింగ విబోధితా శబ్దము. ప్ర.ఏ.

**సమాసాలు:–**

1) మోహపరాయణా – మోహః పరం అయనం యస్యాః సా। (బహువ్రీహి) మోహపరాయణా।
2) వివశా – విగతః వశః యస్యాః సా (బహువ్రీహి) వివశా।
3) కామవధూః – కామస్య వధూః (ష.త) కామవధూః।
4) అసహ్యవేదనమ్ – న సహ్యా (నఞ్తత్పు) అసహ్యా, అసహ్యా వేదనా యస్మిన్ (బ్రహువ్రీహి) తత్, అసహ్యవేదనమ్।
5) నవవైధవ్యమ్ – నవఞ్చ తత్ వైధవ్యమ్ (కర్మధా) నవవైధవ్యమ్।
6) ప్రతిపాదయిష్యతా – ప్రతిపాదయిష్యతీతి ప్రతిపాదయిష్యన్ తేన ప్రతిపాదయిష్యతా।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. అథ – అవ్యయకోశము (17)**

**"అథ మంగళానన్తరారమ్భప్రశ్నకార్త్స్న్యాధికారప్రతిజ్ఞాసముచ్చయ వితర్క వికల్పేషు"**

1. మంగళే – **అథ** శబ్దానుశాసనమ్। (మహాభాష్యే ప్రారమ్భే)
2. ఆనన్తర్యే – **అథ** ప్రజానామధిపః, ప్రభాతే–1 (రఘువంశే 2–1)
3. ఆరమ్భే – **అథాతో** ధర్మం వ్యాఖ్యాస్యామః। (ఆప. ధర్మసూత్రే 1–1)
4. ప్రశ్నే – **అథ** శక్నోషి భోక్తుమ్? అథ ధావసి పర్వతే?
5. కార్త్స్న్యే–**అథ** పరస్మైపదమ్। (పరస్మైపదాని కార్త్స్న్యేన ప్రతిపాద్యన్తే ఇత్యర్థః)

6. అధికారే – అథ యోగానుశాసనమ్ (యోగసూ. (1–1)
7. ప్రతిజ్ఞాయామ్ – గౌడో భవాన్ **అథేతి** బ్రూమః। (భవాన్ గౌడ ఇతి సప్రతిజ్ఞం బ్రూమ ఇత్యర్థః)
8. సముచ్చయే – 'దుర్యోధనేఽథ రాధేయః' (మహాభారతే)
9. వితర్కే – శబ్దో నిత్యః, అథానిత్యః, సంశయేఽపి వితర్క విశేష ఏవ అతశ్చ సంశయార్థేపి అథ శబ్దః ప్రయుజ్యతే।
10. వికల్పే – ఋతావుపేయాత్, /ఋతౌ వ్యపేయాత్) అథానృతౌ పర్వవర్జమ్! పక్షాన్తరేఽపి దృశ్యతే। యథా–**అథ** చేత్ త్వమిమం ధర్మ్యం సంగ్రామం న కరిష్యసి (గీత 2–33) ఇత్యాదిషు.

**2) అథాఽతో బ్రహ్మ జిజ్ఞాసా – బ్రహ్మసూత్రములు**

వ్యాసమహర్షి సమస్తవాఙ్మయాల సారాంశాన్ని ఏకోన్ముఖం చేయాలనే తపనతో ఆషాఢపూర్ణిమనాడు రచించిన గ్రంథము బ్రహ్మసూత్రంగా ఆవిర్భవించిందని విద్వాంసులు ఎఱుగనిదికాదు. ఈ ఆవిర్భావాన్ని పురస్కరించుకొని ఆషాఢపూర్ణిమ వ్యాసపూర్ణిమగా, గురుపూర్ణిమగా జరుపు కోవడం సంప్రదాయమైనది.

బ్రహ్మసూత్రములందు మొదటి నాలుగు సూత్రములకు 'శారీరక మీ మాంసాచతుఃసూత్రీ' అని పేరు. దీనికి అపరశంకరుడుగా పేరొందిన శ్రీబెల్లంకొండ రామరాయకవి విస్తృతవ్యాఖ్యను అందించినాడు. అందు 'అథ' శబ్దమునకు వారు అందించిన శతాధిక నిర్వచనములు – అద్వితీయములు. విద్వాంసులు దానిని ఇట అనుసంధానము చేసికొందురని తలంతును.

**ఛందస్సు :–** 'రతివిలాపవర్ణనమ్' అను ఈ సర్గనామమునకు అనుగుణముగా ఇందలి శ్లోకములు వియోగినీ వృత్తమున నిబంధింపబడుట గమనింపదగినది. లక్షణము – 'విషమే ససజా గురుః సమే, సభరా లోఽథ గురు ర్వియోగినీ'

---

**శ్లో ॥ అవధానపరే చకార సా**
**ప్రలయాన్తోన్మిషితే విలోచనే।**
**న వివేద తయోరతృప్తయోః**
**ప్రియమత్యన్తవిలుప్తదర్శనమ్ ॥ 2**





**పదవిభాగము:–** అవధానపరే, చకార, సా, ప్రలయాన్తోన్మిషితే, విలోచనే, న, వివేద, తయోః, అతృప్తయోః, ప్రియమ్, అత్యన్తవిలుప్తదర్శనమ్।

**అన్వయక్రమము:–** సా ప్రలయాన్తోన్మిషితే విలోచనే అవధానపరే చకార। ప్రియమ్ అతృప్తయోః తయోః అత్యన్తవిలుప్తదర్శనం న వివేద।

**ప్రతిపదార్థము:–** సా–ఆ రతిదేవి, ప్రలయాన్తోన్మిషితే–మూర్ఛావసానమున తెఱువబడిన, విలోచనే–కన్నులను, అవధానపరే–స్మృతి ప్రధానము గలవిగా, చకార– చేసెను, ప్రియమ్–ప్రియుడగు మన్మథునిగూర్చి, అతృప్తయోః–తృప్తి చెందని, తయోః–ఆ కన్నులకు, అత్యన్తవిలుప్తదర్శనమ్–మిక్కిలి నష్టమగు దర్శనము కలవానినిగా, న వివేద– తెలిసికొనదాయెను.

**తాత్పర్యము:–** ఆ రతిదేవి మూర్ఛావసానమున తెఱవబడిన కన్నులను స్మృతి ప్రధానము గలవిగా చేసెను. ప్రియుడగు మన్మథునిగూర్చి తృప్తి చెందని ఆ కన్నులకు మిక్కిలి నష్టమగు దర్శనము కలవానినిగా తెలిసికొనదాయెను. (ఆ కన్నులకు ఇక మన్మథరూపము దర్శింప వీలులేదను విషయమును మాత్రము ఆమె గ్రహింపనిదాయెను అని తాత్పర్యము).

**పాఠాన్తరాలు:–** విలుప్త నిమగ్న (కాలే)

**విభక్తులు/క్రియలు:–** 1. సా–**సా**, తే,తాః, దకారాన్త స్త్రీలింగతచ్ఛబ్దము ప్ర.ఏ., 2. ప్రలయాన్తోన్మిషితే – ప్రలయాన్తోన్మిషితమ్..., **ఉన్మిషితే...,** ఉన్మిషితాని, అకారాన్త నపుంసకలింగ. ఉన్మిషిత శబ్దము, ద్వి.ద్వి. 3. విలోచనే – విలోచనమ్, **విలోచనే**, విలోచనాని, అకారాన్తనపుంసకలింగ విలోచనశబ్దము ద్వి.ద్వి. 4. అవధానపరే – పరమ్..., **పరే...,** పరాణి..., అకారాన్త నపుంసకలింగ పరశబ్దము ద్వి.ద్వి. 5. చకార – క్రియ – కృ+లిట్ – ప్రథమ పురుషైకవచనాంతః, 6. ప్రియమ్ – **ప్రియమ్,** ప్రియౌ, ప్రియాన్, అకారాన్త పుంలింగ ప్రియశబ్దము ద్వి.ద్వి, 7. అతృప్తయోః – అతృప్తాయాః, **అతృప్తయోః**, అతృప్తానామ్, ఆకారాన్త స్త్రీలింగ అతృప్తాశబ్దము ష.ద్వి., 8. తయోః – తస్యాః, **తయోః** , తాసామ్, దకారాన్త స్త్రీలింగ తచ్ఛబ్దము ష.ద్వి.. 9. అత్యన్తవిలుప్తదర్శనమ్– దర్శనమ్, దర్శనౌ, దర్శనాన్, అకారాన్త పుంలింగ దర్శన శబ్దము, ద్వి.ఏ. 10. న–అవ్యయము, 11. వివేద – విద్+లిట్ – ప్ర.ఏ.

**సమాసాలు:–**

1) ప్రలయాన్తోన్మిషితే – ప్రలయస్య అంతః, (ష.త.) ప్రలయాన్తః, ప్రలయాన్తే ఉన్మిషితమ్ (స.త) ప్రలయాన్తోన్మిషితమ్ తే।
2) అవధానపరే – అవధానం పరం యయోః (బహువ్రీహి) తే।

3) అతృప్తయోః – న తృప్తయోః (నఞ్ తత్పు.)।

4) అత్యన్తవిలుప్తదర్శనమ్ – అత్యన్తం విలుప్తం దర్శనం యస్య (బ్రహువ్రీహి) సః, తమ్।

**సంధులు :–**

1) తయోః+అతృప్తయోః, తయోరతృప్తయోః– విసర్గసంధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటు ప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. అవధానం/వధానం**

ఆప్టే మహాశయుడు – ఈ పద వివరణ సందర్భంగా ఈ శ్లోకమునే ఉదాహరించినాడు. మఱియును. "తదత్ర కవి పరిశ్రమానురోధాద్వా ఉదాత్త కథావస్తు గౌరవాద్వా నవనాటకదర్శనకుతూహలద్వా భవద్భిః **అవధానం** దీయమా నమభ్యర్థయే" అని భట్టనారాయణ విరచిత వేణీసంహారనాటక ప్రస్తావనాభాగాన్ని కూడా ఉదాహరించినాడు. అందుచేత ఈ ప్రదర్శనమునందు కవియొక్క పరిశ్రమపట్లగల ఆదరముతోగాని లేక ఉదాత్తమయిన కథ పట్ల గల గౌరవముతో గాని లేక క్రొత్తదయిన నాటకము చూచుటయందలి ఉత్కంఠతోగాని మీచే ఈయబడుచున్న **ఏకాగ్రత**ను కోరుచున్నాను.

**క్రియాదర్శము:–** 1) **చకార** – డుకృఞ్(కృ) కరణే (చేయుట) సకర్మకమ్, అనిట్ (ఉభయ) పరస్మైపదీ, లిట్ ప్రథమపురుషైకవచనాంతః తనాది ప్రకారణమ్.(8)

రూపాలు: **చకార** – చక్రతుః – చక్రుః – ప్రథమ పురుష
చకర్థ – చక్రథుః – చక్ర – మధ్యమ పురుష
**చకార**/చకర – చకృవ – చక్రమ – ఉత్తమ పురుష

2) 'చకార' మను రూపము తుదాదిప్రకరణమునగల **కౄ–విక్షేపే** అనుధాతువు యొక్క లిట్ ప్రథమ పురుష / ఉత్తమ పురుష ఏకవచనాంతరములుగ నున్నది. వెదజల్లుట అను అర్థము.

3) **వివేద** – విద (విద్) జ్ఞానే (తెలియుట) సకర్మకమ్, సేట్, పరస్మైపదీ అదాదిప్రకరణమ్. లిట్ ప్రథమపురుషైకవచనాంతః।
ఉపవిదజాగృభ్యోన్యతరస్యామ్' అత్యస్య అభావపక్షే

రూపాలు: **వివేద** – వివిదతుః – వివిదుః – ప్రథమ పురుష
వివేదిథ – వివిదథుః – వివిద – మధ్యమపురుష
**వివేద** – వివిదివ – వివిదిమ – ఉత్తమ పురుష



ఈ ధాతువు మఱి 4 గణములలోను ఉన్నది.

1. విద్ (4) – ఆ సత్తాయామ్
2. విద్ (5) – ఉ లాభే
3. విద్ (7) – ఆ. విచారణే
4. విద్ (10) – ఆ చేతనాఖ్యాన నివాసేషు.

---

**శ్లో ॥ 'అయి జీవితనాథ! జీవ సీ'**
**త్యభిధాయోత్థితయా తయా పురః।**
**దదృశే పురుషాకృతి క్షితౌ**
**హరకోపానలభస్మ కేవలమ్॥** 3

**పదవిభాగము:–** అయి, జీవితనాథ!, జీవసి, ఇతి, అభిధాయ, ఉత్థితయా, తయా, పురః, దదృశే, పురుషాకృతి, క్షితౌ, హరకోపానలభస్మ, కేవలమ్।

**అన్వయక్రమము:–** అయి జీవితనాథ! ఇతి అభిధాయ ఉత్థితయా తయా పురః క్షితౌ పురుషాకృతి కేవలం హరకోపానలభస్మ దదృశే।

**ప్రతిపదార్థము:–** అయి జీవితనాథ – ఏ ప్రాణేశ్వరా!, జీవసి?–బ్రతికియుంటివా?, ఇతి–అని, అభిధాయ–పలికి, ఉత్థితయా–లేచిన, తయా–ఆ రతిదేవిచే, పురః –ముందట, క్షితౌ–భూమియందు, పురుషాకృతి–పురుషుని ఆకారమువంటి యాకారముగల, కేవలమ్–ఒక్క, హరకోపానలభస్మ–శివునియొక్క కోపాగ్ని సంబంధమగు బూడిద, దదృశే–అగపడెను.

**తాత్పర్యము:–** 'ఓ ప్రాణేశ్వరా! బ్రతికియుంటివా?' అని పలికి లేచిన ఆ రతిదేవిచే ముందట భూమియందు పురుషుని ఆకారము వంటి యాకారముగల ఒక్క శివుని కోపాగ్ని సంబంధమగు బూడిద అగపడెను.

**పాఠాన్తరాలు :–** కృతి – కృతిః

**విభక్తులు/క్రియలు:–** 1.అయి–అవ్యయము, 2. జీవితనాథ–**హే జీవితనాథ** , హే జీవితనాథౌ, హే జీవితనాథాః, అకారాన్తపుంలింగ జీవితనాథ శబ్దము, సంబోధన ప్రథమా విభక్తి ఏకవచనము, 3. జీవసి–క్రియ, లట్, మధ్యమపురుషైకవచనాంతః, 4. ఇతి–అవ్యయము, 5. అభిధాయ – అభి+ధా+క్త్వా–ల్యబన్తము, 6. ఉత్థితయా– ఉత్థితయా, ఉత్థితాభ్యామ్, ఉత్థితాభిః, ఆకారాన్త స్త్రీలింగ

ఉత్థితా శబ్దము, తృ.ఏ. 7. తయా – **తయా**, తాభ్యామ్, తాభిః, దకారాన్త స్త్రీలింగతచ్ఛబ్దము,తృ.ఏ., 8. పురః, కేవలమ్ – అవ్యయాలు, 9. క్షితౌ – **క్షితౌ,** క్షిత్యోః, క్షితిషు, ఇకారాన్త స్త్రీలింగ క్షితిశబ్దము, స.ఏ., 10. పురుషాకృతి – **పురుషాకృతి,** పురుషాకృతినీ, పురుషాకృతీని, ఇకారాన్త నపుంసక లింగ పురుషాకృతి శబ్దము, ప్ర.ప., 11. హరకోపానలభస్మ –**... భస్మ,** ...భస్మనీ, ...భస్మాని, నకారాన్త నపుంసకలింగ భస్మన్శబ్దము, ప్ర.ఏ. 12. దదృశే– క్రియ–దృశ్+లిట్–ప్రథమపురుషైకవచనాంతః.

**సమాసాలు:–**

1) జీవితనాథ – జీవితస్య నాథః (ష.త) జీవితనాథః, తత్సమ్బుద్ధౌ।

2) పురుషాకృతి – పురషస్య ఆకృతిః ఇవ ఆకృతిః యస్య (బహువ్రీహి) తత్।

3) హరకోపానలభస్మ – కోప ఏవ అనలః (మయూరవ్యంసకాది తత్పు.) కోపానలః హరస్య కోపానలః (ష.త) హరకోపానలః, హరకోపానలస్య భస్మ (ష.త)।

**సంధులు :–**

1) జీవసి+ఇతి – జీవసీతి–సవర్ణదీర్ఘసంధిః।

2) ఇతి+అభిధాయ – ఇత్యభిధాయ – యణాదేశసంధిః।

3) అభిధాయ+ఉత్థితయా – అభిధాయోత్థితయా – గుణసంధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. అయి – అవ్యయకోషః (108)**

**'ప్రశ్నానురాగాదిష్వపి దృశ్యతే'**

1. సంబోధనే – 'అయి విజహీహి దృఢోపగూహనమ్–1'

2. అనునయే – 'అయి ఘనోరు! పదాని శనైః శనైః' (వేణీసంహారే)

'అయి సాహసకారిణి' (రత్నావలీ)

3. ప్రశ్నే – 'అయి కఠోరయశః కిల తే ప్రియమ్'!

4. అనురాగే – 'అయి జీవితనాథ! జీవసి' (కు.సం.4–3)

ఈ శ్లోకాన్నే 'అయి' అను అవ్యయ పద వివరణసందర్భంగా అవ్యయకోశము ఉదాహరించుట గమనింపదగినది. అనురాగ ఏవ ప్రణయకోపరూపాహ్వాన మితి 'నిపాతావ్యయోపసర్గవృత్తిః'।

**2) కేవలమ్– 1)**Only, Merely, Solely, Entirely, Absolutely, Wholly అని 'ఆప్టే' మహాశయుడు. అవ్యయము.

ఎ) కేవలమిదమేవ పృచ్ఛామి – కాదంబరి (155)



బి) శ్లో॥ బలమార్తభయోపశాన్తయే
విదుషాం సత్కృతయే బహుశ్రుతమ్
వసు తస్య విభోర్న **కేవలం**
గుణవత్తాపి పరప్రయోజనా॥ ర.వం.8–31

"(అజ) మహారాజు వద్ద నున్న సర్వసద్గుణములు లోకోపకారమునకే ఉపయోగపడినవి అని తాత్పర్యము."

**క్రియాదర్శము:– దదృశే** – 'దృశిర్ ప్రేక్షణ' ఇత్యస్మాద్ధాతోస్సకర్మకాత్కర్మణి భూతేలిట్ ఆత్మనేపదే ప్రథమపురుషైకవచనాంతః భ్వాదయః।

రూపాలు – **దదృశే** – దదృశాతే – దదృశిరే

శ్లో॥ విషాదలుప్తప్రతిపత్తివిస్మితం
కుమారసైన్యం సపది స్థితం చ తత్।
వసిష్ఠధేనుశ్చ యదృచ్ఛయాగతా
శ్రుతప్రభావా **దదృశే**ఉ **థ** నందినీ॥ ర.వం. 3–40

.... నందినీ నామకమయిన వసిష్ఠమహర్షియొక్క ధేనువుకూడ **అగపడెను.**

---

11

**శ్లో॥ అథ సా పునరేవ విహ్వలా**
**వసుధాలిఙ్గనధూసరస్తనీ।**
**విలలాప వికీర్ణమూర్ధజా**
**సమదుఃఖామివ కుర్వతీ స్థలీమ్॥** **4**

**పదవిభాగము:–** అథ, సా, పునః, ఏవ, విహ్వలా, వసుధాలిఙ్గనధూసరస్తనీ, విలలాప, వికీర్ణమూర్ధజా, సమదుఃఖామ్, ఇవ, కుర్వతీ, స్థలీమ్।

**అన్వయక్రమము:–** అథ పునః ఏవ విహ్వలా వసుధాలిఙ్గనధూసరస్తనీ వికీర్ణమూర్ధజా సా స్థలీం సమదుఃఖాం కుర్వతీ ఇవ విలలాప।

**ప్రతిపదార్థము:–** అథ – పిమ్మట, పునః + ఏవ – మఱియు, విహ్వలా – భయనిశ్చేష్టితయై, వసుధాలిఙ్గనధూసరస్తనీ – భూమిపై పొరలుటచే బూడిద రంగుగల స్తనములు గలదై, వికీర్ణమూర్ధజా – విడివడి వ్రేలాడుచున్న తలవెంట్రుకలు గలదై, సా – ఆ రతిదేవి, స్థలీమ్ – ఆ త్ర్యమ్బకాశ్రమభూమిని, సమదుఃఖామ్ –

సమానముగా దుఃఖముగల దానినిగా, కుర్వతీ + ఇవ – చేయుచున్నదియు వలె, విలలాప – విలపించెను.

**తాత్పర్యము:–** పిమ్మట, భయనిశ్చేష్టిత, భూమిపై పొరలుటచే బూడిద రంగు గలస్తనములుగల, విడివడి వ్రేలాడుచున్న తలవెంట్రుకలు గలదియగు ఆ రతీదేవి ఆ త్ర్యమ్బకా శ్రమభూమిని సమానముగా దుఃఖముగల దానినిగా చేయుచున్నదియు వలె విలపించెను.

**పాఠాన్తరాలు:–** ధూసరస్తనీ – ధూసరాకృతిః।

**విభక్తులు/క్రియలు:–** 1. అథ, ఏవ, పునః, ఇవ – అవ్యయాలు, 2. విహ్వలా – **విహ్వలా**, విహ్వలే, విహ్వలాః, అకారాన్త స్త్రీలింగ విహ్వలా శబ్దము, ప్ర.ఏ., 3. వసు...స్తనీ – **స్తనీ**, ...స్తన్యౌ, ...స్తన్యః, ఈకారాన్త స్త్రీలింగ స్తనీ శబ్దము, ప్ర.ఏ., 4. వికీర్ణమూర్ధజా – **వికీర్ణమూర్ధజా**, వికీర్ణమూర్ధజే, వికీర్ణమూర్ధజాః, ఆకారాన్త స్త్రీలింగ వికీర్ణమూర్ధజా శబ్దము ప్ర.ఏ., 6. సా – **సా**, తే, తాః, దకారాన్త స్త్రీలింగతచ్ఛబ్దము, ప్ర.ఏ., 6. స్థలీమ్–**స్థలీమ్**, స్థల్యౌ, స్థలీః, ఈకారాన్త స్త్రీలింగ స్థలీ శబ్దము. ద్వి.ఏ., 7. సమదుఃఖామ్ – **సమదుఃఖామ్**, సమదుఃఖే, సమదుఃఖాః, ఆకారాన్త స్త్రీలింగ సమదుఃఖా శబ్దము, ద్వి.ఏ., 8. కుర్వతీ – కుర్వతీ, కుర్వత్యౌ, కుర్వత్యః, ఈకారాన్త స్త్రీలింగ కుర్వతీ శబ్దము ప్ర.ఏ., 9. విలలాప – వి + లప్ + లిట్ – ప్రథమపురుషైకవచనాంతః ।

**సమాసాలు:–**

1) వసుధాలిఙ్గనధూసరస్తనీ – వసుధాయా ఆలింగనమ్(ష.త) వసుధాలిఙ్గనమ్, వసుధాలిఙ్గనేన ధూసరౌ స్తనౌ యస్యాః (బహువ్రీహి) సా।
2) వికీర్ణమూర్ధజా – వికీర్ణాః మూర్ధజాః, యస్యాః (బహువ్రీహి) సా।
3) సమదుఃఖామ్ – సమం దుఃఖం యస్యాః (బహువ్రీహి) సా, సమదుఃఖా, తామ్।

**సంధులు:–** పునః + ఏవ – పునరేవ – విసర్గసంధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటు ప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. విహ్వలః**– (త్రి)

ఎ) వి + హ్వల్ + అచ్ – భయాదినాభిభూతః

బి) శ్లో॥ క్షణమాత్రసఖీం సుజాతయోః
స్తనయోస్తామలోక్య **విహ్వలా**।
నిమిమీల నరోత్తమప్రియా
హృతచన్ద్రా తమసేవ కౌముదీ॥ ర.వ. 8–37



..... ఇందుమతి యొక్క స్తనములమీద చెలికత్తెవలె క్షణకాలము పడియున్న ఆ మాలనుచూచి భయభ్రాంతయైన ఇందుమతి, రాహువుచేత మ్రింగబడిన చంద్రునియొక్క వెన్నెలవలె కన్నులను మూసికొనెను (మరణించెనని తాత్పర్యము)"

సి) "....విక్లవో విహ్వలః స్మృతః" అని హలాయధకోశము

డి) 'విత్తవ్యాధి వికారవిహ్వలగిరాం నామాపి న శ్రూయతే' అని భర్తృహరి.

**క్రియాదర్శము :– విలలాప** – వి–ఉపసర్గ, లప (లప్) వ్యక్తాయాం వాచి (మాట్లాడుట) అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, భ్వాది ప్రకరణమ్(1). లిట్ ప్రథమ పురుషైకవచనాంతః

రూపాలు – **విలలాప** – విలేపతుః – విలేపుః

---

శ్లో ॥ **ఉపమానమభూద్విలాసినాం**
**కరణం యత్తవ కాన్తిమత్తయా।**
**తదిదం గతమీదృశీం దశాం న**
**విదీర్యే కఠినాః ఖలు స్త్రియః ॥** **5**

**పదవిభాగము:–** ఉపమానమ్, అభూత్, విలాసినామ్, కరణమ్, యత్, తవ, కాన్తిమత్తయా, తద్, ఇదమ్, గతమ్, ఈదృశీమ్, దశామ్, న, విదీర్యే, కఠినాః, ఖలు, స్త్రియః।

**అన్వయక్రమము:–** యత్, తవ, కరణం కాన్తిమత్తయా విలాసినామ్ ఉపమానమ్ అభూత్ తద్ ఇదమ్ ఈదృశీం దశాం గతం న విదీర్యే స్త్రియః కఠినాః ఖలు।

**ప్రతిపదార్థము:–** యత్ – ఏ, తవ – నీయొక్క, కరణమ్ – దేహము, కాన్తిమత్తయా – సౌందర్యకారణముచే, విలాసినామ్–విలాసవంతులకు, ఉపమానమ్ – పోల్చదగినదియై, అభూత్ – ఆయెనో, తద్ – ఆ శరీరము, ఇదమ్–ఇదే, ఈదృశీమ్ – ఇట్టి, దశామ్ – అవస్థను, గతమ్ – పొందినది, న విదీర్యే– చీల్పబడకుంటిని, స్త్రియః – స్త్రీలు, కఠినాః – కఠినలు, ఖలు – కదా?.

**తాత్పర్యము:–** "ఏ నీయొక్క దేహము సౌందర్యకారణముచే విలాసవంతులకు పోల్చదగినదియై ఆయెనో, ఆ శరీరము ఇదే ఇట్టి అవస్థను పొందినది. చీల్చ

బడకుంటిని, స్త్రీలు కఠినలుగదా" (అని రతిదేవి విలపించుచున్నది)

**పాఠాన్తరాలు:-** విదీర్యే - చ దీర్యే.

**విభక్తులు/క్రియలు:-** 1. యత్ - **యత్**, యే, యాని, దకారాన్త నపుంసకలింగ యచ్ఛబ్దము ప్ర.ఏ., 2. తవ - **తవ/తే**, యువయోః/వామ్, యుష్మాకమ్/వః, దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము, 3. కరణమ్ - **కరణమ్,** కరణే, కరణాని, అకారాన్త నపుంసకలింగ కరణ శబ్దము ప్ర.ఏ., 4. కాన్తిమత్తయా - **కాన్తిమత్తయా**, కాన్తిమత్తాభ్యామ్, కాన్తిమత్తాభిః, ఆకారాన్త స్త్రీలింగ కాన్తిమత్తాశబ్దము, తృ.ఏ 5. విలాసినామ్ - విలాసినః, విలాసినోః, **విలాసినామ్**, నకారాన్త పుంలింగ విలాసిన్ శబ్దము, ష.బ., 6. ఉపమానమ్ - ఉపమీయతే అనేన ఇతి ఉపమానమ్, ల్యుట్‌ప్రత్యయః, 7. అభూత్-క్రియ, భూతే లుఙ్, ప్రథమపురుషైకవచనాంతః, 8. తద్ - **తద్**, తే, తాని, దకారాన్త నపుంసకలింగ తచ్ఛబ్దము ప్ర.ఏ., 9. ఇదమ్ - **ఇదమ్**, ఇమే, ఇమాని, మకారాన్త నపుంసకలింగ **ఇదమ్** శబ్దము, ప్ర.ఏ, 10. ఈదృశీమ్ - **ఈదృశీమ్**, ఈదృశ్యౌ, ఈదృశీః, ఈకారాన్త స్త్రీలింగ ఈదృశీశబ్దము, ద్వి.ఏ., 11. దశామ్- **దశామ్**, దశే, దశాః, ఆకారాన్త స్త్రీలింగ దశాశబ్దము, ద్వి.ఏ. 12. గతమ్ - **గతమ్**, గతే, గతాని, అకారాన్తనపుంసకలింగ గత శబ్దము ప్ర.ఏ 13.న, ఖలు అవ్యయాలు. 14. విదీర్యే - వి + దృ + లట్ - ఉత్తమపురుషైకవచనాంతః (కర్మకర్తరి), స్త్రియః - స్త్రీ, స్త్రియౌ, **స్త్రియః** - ఈకారాన్త స్త్రీలింగ స్త్రీశబ్దము ప్ర.బ. 16. కఠినాః - కఠినా, కఠినే, కఠినాః - ఆకారాన్త స్త్రీలింగ కఠినా శబ్దము, ప్ర.బ.

**సంధులు**:- అభూత్ + విలాసినామ్- అభూద్విలాసినామ్ - జశ్త్వసంధిః

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

**1. ఖలు :-** అవ్యయము ఎ) ఖల్ + బాహులకాద్ ఉన్ - నిశ్చితమ్

బి) శ్లో॥ అయి! సమ్ప్రతి దేహి దర్శనం
స్మర! పర్యుత్సుక ఏష మాధవః।
దయితాస్వనవస్థితం నృణాం
న **ఖలు** ప్రేమ చలం సుహృజ్జనే॥ కు.సం-4-28

సి) 'నిషేధవాక్యాలంకారజిజ్ఞాసానునయే ఖల్వ'తి సింహః।

డి) అవ్యయకోశము (326)
నిషేధ-వాక్యాలంకార - జిజ్ఞాసా - అనునయ - నియమ - నిశ్చయ-హేతు విషాదా దయోఽస్యార్థాః।

1) నిషేధే - 'ఖలు కృత్వా। 'నిర్ధారితేఽర్థే లేఖేన ఖలూక్త్వా ఖలు వాచికమ్' (మాఘః 2-70)

2) వాక్యాలంకారే - 'అథో ఖల్వాహుః'।





3) జిజ్ఞాసాయామ్- 'ప్రత్యూహేన క్రతూనాం న ఖలు మఖభుజో భుంజతే వా హవీంషి' అనర్ఘరాఘవే 1-25)

4. అనునయే - 'న ఖలు న ఖలు ముగ్ధే। సాహసం కార్యమేతత్' (నాగానందే 2-11)

5) నియమే - 'ప్రవృత్తిసారాః ఖలు మాదృశాం ధియః' (కిరాతా 1-25)

6) నిశ్చయే - 'ఖలు దీయతే తుభ్యమ్'

7) హేతౌ - 'త్వదధీనం ఖలు దేహినాం సుఖమ్' - కు.సం.4-10

8) విషాదే - 'న విదీర్యే కఠినాః ఖలు స్త్రియః' -కు.సం. 4-5

9) పాదపూరణేఽపి - యథా 'వధ్యాః ఖలు న వధ్యన్తే-' రామాయణమ్ 3-41-6

10) వీప్సాయామపి దృశ్యతే - యథా - 'కాలే ఖలు సమారబ్ధాః ఫలం బధ్నన్తి నీతయః। రఘువంశమ్

II) విలాసినామ్ ఎ) విలసనశీలాః విలాసినః తేషాం విలాసినామ్.

బి) విలాసలక్షణమ్-

శ్లో॥ ధీరసంచారిణీ దృష్టిర్గతిర్గోవృషభాఞ్చితా।
స్మితపూర్వమథాలాపో విలాస ఇతి కీర్తితః॥ (దశరూపకే)

'విలాసో భూషణాలాపగతికర్మసు చారుతా' ఇతి చ.

**అలంకారములు:-** అస్మిన్ శ్లోకే కారణాత్ కార్యసమర్థనస్వరూపోఽర్థాన్తర - న్యాసోఽలంకారః

లక్షణమ్ - సామాన్యవిశేషకార్యకారణభావాభ్యామ్।
నిర్దిష్టప్రకృతసమర్థనమర్థాంతరన్యాసః॥ - రుయ్యక 'అలంకార సర్వస్వమ్'. కార్యము కారణమునకు, కారణము కార్యమునకు సమర్థకమగుట 'అర్థాన్తరన్యాసాలంకార' మనబడును.

**క్రియాదర్శము:- విదీర్యే** -వి-ఉపసర్గ, దౄ - విదారణే- క్ర్యాదిప్రకరణమ్, పరస్మైపదీ, సకర్మకమ్, సేట్, కర్మకర్తరి ప్రయోగము లట్. రూపాలు.

---

**శ్లో॥ క్వ ను మాం త్వదధీనజీవితాం**
**వినికీర్య క్షణభిన్నసౌహృదః।**
**నలినీం క్షతసేతుబన్ధనో**
**జలసంఘాత ఇవాసి విద్రుతః ॥ 6**

**పదవిభాగము:–** క్వ, ను, మామ్, త్వదధీనజీవితామ్, వినికీర్య, క్షణభిన్నసౌహృదః నలినీమ్, క్షతసేతుబన్ధనః, జలసంఘాతః, ఇవ, అసి, విద్రుతః।

**అన్వయక్రమము:–** క్షతసేతుబన్ధనః జలసంఘాతః నలినీమ్ ఇవ త్వదధీనజీవితాం మాం వినికీర్య క్షణభిన్నసౌహృదః క్వ ను విద్రుతః అసి।

**ప్రతిపదార్థము:–** క్షతసేతుబన్ధనః – తెగగొట్టబడిన ఆనకట్టగల, జలసంఘాతః – నీటి ప్రవాహము, నలినీమ్+ఇవ – పద్మసమూహమువలె, త్వదధీనజీవితామ్– నీ అధీనమైన ప్రాణముగల, మామ్ – నన్ను, క్వ ను వినికీర్య– ఎక్కడ పడవైచి, క్షణభిన్నసౌహృదః–క్షణములో త్రుంపబడిన మైత్రిగలవాడవై, విద్రుతః–కరిగి పోయిన వాడవు, అసి–అయితివి.

**తాత్పర్యము:–** (ఓ ప్రియుడా) తెగగొట్టబడిన ఆనకట్టగల నీటి ప్రవాహము పద్మ సమూహమునువలె, నీ అధీనమయిన ప్రాణముగల నన్ను ఎక్కడ పడవైచి క్షణములో త్రుంపబడిన మైత్రిగలవాడై కరిగి పోయినవాడవు అయితివి.

**విభక్తులు/క్రియలు:–** 1. క్షతసేతుబన్ధనః – **బన్ధనః**, ..బన్ధనౌ, ...బన్ధనాః, అకారాన్త పుంలింగ ...బన్ధన శబ్దము ప్ర.ఏ., 2. జలసంఘాతః – **జలసంఘాతః**, జలసంఘాతౌ, జలసంఘాతాః, అకారాన్త పుంలింగ జలసంఘాత శబ్దము, ప్ర.ఏ. 3. నలినీమ్ – **నలినీమ్,** నలిన్యౌ, నలినీః, ఈకారాన్త స్త్రీలింగ నలినీశబ్దము ద్వి.ఏ. 4. ఇవ, క్వ, ను – అవ్యయాలు, 5. త్వదధీనజీవితామ్ – **జీవితామ్,** జీవితే, జీవితాః, ఆకారాన్త స్త్రీలింగ జీవితా శబ్దము, ద్వి.ఏ. 6. మామ్ – **మామ్/మా,** ఆవామ్/నౌ, అస్మాన్/నః, దకారాన్త పుంలింగ అస్మచ్ఛబ్దము ద్వి.ఏ. 7. వినికీర్య – వి + ని + కృ + క్త్వా – ల్యబన్తము. 8. క్షణభిన్నసౌహృదః – సౌహృదః, సౌహృదౌ, సౌహృదాః అకారాన్తపుంలింగ సౌహృదశబ్దము ప్ర.ఏ. 9. విద్రుతః – విద్రుతః, విద్రుతౌ, విద్రుతాః అకారాన్త పుంలింగ విద్రుత శబ్దము ప్ర.ఏ. 10. అసి – క్రియ– అస్ + లట్ – మధ్యమపురుషైకవచనాంతః.

**సమాసాలు:–**

1) క్షతసేతుబంధనః – సేతోః బన్ధనమ్(ష.త) సేతుబంధనమ్– క్షతం సేతుబంధనం యేన (బహువ్రీహి) సః।
2) జలసంఘాతః – జలానాం సంఘాతః(ష.త) జలసంఘాతః।



3) త్వదధీనజీవితామ్ – తవ అధీనం (ష.త) త్వదధీనం, త్వదధీనం జీవితం యస్యాః (బహువ్రీహి) సా, తామ్।
4) క్షణభిన్నసౌహృదః – శోభనం హృదయం యస్య (బహువ్రీహి) సః, సుహృత్, సుహృదో భావః సౌహృదమ్, క్షణేన భిన్నం సౌహృదం యేన (బహువ్రీహి) సః।
5) విద్రుతః – విశేషేణ ద్రుతః (ప్రాది తత్పు)

**సంధులు:–**

1) క్షతసేతుబంధనః + జలసంఘాతః–క్షణసేతుబంధనో జలసంఘాతః – ఉత్వాదేశసంధిః।
2) జలసంఘాతః + ఇవ – జలసంఘాత ఇవ – విసర్గలోపసంధిః।
3) ఇవ + అసి – ఇవాసి – సవర్ణదీర్ఘసంధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. ను – అవ్యయకోశము (483)**

'ప్రశ్నప్రతివచనోపమానవితర్కోత్ప్రేక్షా విషాదపాదపూరణాదిషు వర్తతేऽ యమ్'।

1. ప్రశ్నే– 'కో ను వాచమీరయత్యన్తరిక్షే' ।
 కిం ను వై జృమ్భతే కిల'।
 'కో న్వస్మిన్ సామ్ప్రతం లోకే'। –రామాయణమ్
2. ప్రతివచనే – 'ఆకర్షీః కటం దేవదత్త? అయం ను కరోమి భోః'।
 అయం ను అకార్షమ్।
3. ఉపమానే – 'వృక్షస్య ను తే పురుహూత వయాః' ఋగ్–6–24–3
4. వితర్కే – 'క్షాళితం ను శమితం ను వధూనాం ద్రావితం ను హృదయం మధువారైః' – మాఘే–10–4
6. ఉత్ప్రేక్షాయామ్ – 'రఞ్జితా ను వివిధాస్తరుశైలా నామితం ను గగనం స్థగితం ను'। కిరాతార్జునీయే 9–15
7. **విషాదే – క్వ ను మాం త్వదధీనజీవితామ్** (కు.సం.4–6)
8. పాదపూరణే – ఆఖ్యాస్యామి ను తే తత్త్వమ్।
9. క్వచిద్ విస్మయేऽపి। యథా – 'క్వ ను ఖలు విదితస్తే కోऽప్యసౌ ధాతువాదః' పాదుకాసహస్రే – 501

10.ఏవం అనునయేఽపి – 'త్వం ను మే ప్రియతమా హి వధూనామ్' ఇత్యాదౌ।

**క్రియాదర్శనము:– అసి –** అస (అస్) భువి (ఉండుట) అదాది ప్రకరణమ్(2), అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ. లట్–మధ్యమపురుషైకవచనాంతః.

రూపాలు – **అసి** – స్థః – స్థ

**అలంకారములు:–** ఇందు 'ఉపమాలంకార' మున్నదని చెప్పదగును.

లక్షణమ్– ఉపమానోపమేయయోః సాధర్మ్యే
భేదాభేదతుల్యత్వే **ఉపమా।**
– శ్రీరాజానకరుయ్యక 'అలంకార సర్వస్వము'

ఉపమానోపమేయములకు సాధర్మ్యము భేదాభేదతుల్యముగనున్నచో 'నుపమాలంకార'మగును.

---

**శ్లో॥ కృతవానసి విప్రియం న మే**
**ప్రతికూలం న చ తే మయా కృతమ్।**
**కిమకారణమేవ దర్శనం**
**విలపన్త్యై రతయే న దీయతే॥ 7**

**పదవిభాగము:–** కృతవాన్, అసి, విప్రియమ్, న , మే, ప్రతికూలమ్, న, చ, తే, మయా, కృతమ్, కిమ్, అకారణమ్, ఏవ, దర్శనమ్, విలపన్త్యై, రతయే, న, దీయతే।

**అన్వయక్రమము:–** (జీవితనాథ!) మే విప్రియమ్ కృతవాన్ న అసి। మయా చ తే ప్రతికూలం న కృతమ్। అకారణమ్ ఏవ విలపన్త్యై రతయే కిం దర్శనం న దీయతే।

**ప్రతిపదార్థము:–** (హే జీవితనాథ। – ఓ ప్రాణేశ్వరా!), మే – నాకు, విప్రియమ్ – అపరాధమును, కృతవాన్ – చేసినవాడవు, న+అసి–కావు, మయా చ – నాచేతను, తే – నీకు, ప్రతికూలమ్ – విరోధము, న కృతమ్ – చేయబడినది కాదు, అకారణమ్ + ఏవ – కారణములేకుండగానే, విలపన్త్యై – విలపించుచున్న, రతయే–రతిదేవికి, కిమ్ దర్శనమ్ – ఏల దర్శనము, న దీయతే – ఇప్పింపకున్నావు.

**తాత్పర్యము:–** (ఓ ప్రాణేశ్వరా!) నాకు అపరాధము చేసినవాడవు కావు. నా చేతను విరోధము నీకు చేయబడినది కాదు. కారణము లేకుండగానే, విలపించుచున్న రతిదేవికి ఏల దర్శనము ఇప్పింపకున్నావు.





**విభక్తులు/క్రియలు:–** 1. మే – **మే**, ఆవయోః, అస్మాకమ్/నః, దకారాన్తపుంలింగ అస్మచ్ఛబ్దము ష.ఏ 2. విప్రియమ్ – **విప్రియమ్,** విప్రియౌ, విప్రియాన్, అకారాన్త పుంలింగ విప్రియ శబ్దము ద్వి.ఏ. 3. కృతవాన్ – **కృతవాన్**, కృతవన్తౌ, కృతవన్తః, తకారాన్త పుంలింగ కృతవత్‌శబ్దము, ప్ర.ఏ. 4. న, చ, ఏవ, కిమ్ – అవ్యయాలు, 5. మయా–**మయా,** ఆవాభ్యామ్, అస్మాభిః, దకారాన్తపుంలింగ అస్మచ్ఛబ్దము తృ.ఏ. 6. ప్రతికూలమ్ – **ప్రతికూలమ్**, ప్రతికూలే, ప్రతికూలాని, అకారాన్త నపుంసక లింగ ప్రతికూలశబ్దము, ప్ర.ఏ. 7. కృతమ్ – **కృతమ్**, కృతే, కృతాని, అకారాన్తనపుంసకలింగ కృతశబ్దము ప్ర.ఏ. 8. అకారణమ్ – **క్రియావిశేషణము** 9. విలపన్త్యై – **విలపన్త్యై,** విలపన్తీభ్యామ్, విలపన్తీభ్యః, ఈకారాన్త స్త్రీలింగ విలపన్తీ శబ్దము, చ.ఏ. 10. రతయే – **రతయే,** రతిభ్యామ్, రతిభ్యః , ఇకారాన్త స్త్రీలింగరతి శబ్దము, చ.ఏ., 11. దర్శనమ్ – దర్శనమ్, దర్శనే, దర్శనాని, అకారాన్త నపుంసకలింగ దర్శన శబ్దము ప్ర.ఏ. 12. దీయతే – క్రియ – కర్మణి ప్రయోగము – లట్ – ప్రథమపురుషైకవచనాంతః

**సమాసాలు:–**

1) విప్రియమ్ – విపరీతం ప్రియమ్ (ప్రాదితత్పు.) విప్రియమ్।
2) అకారణమ్ – అవిద్యమానం కారణం యస్మిన్(బహువ్రీహి) కర్మణి తత్ యథా స్యాత్తథా।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. రతిః– ఎ) రమ్యతేఽనయా ఇతి। రమ్ క్తిన్।**

బి) శ్లో॥ మనో మథ్నాతి సర్వేషాం పంచబాణేన కామినామ్।
తన్నామ మన్మథస్తేన ప్రవదన్తి మనీషిణః॥

శ్లో॥ తస్య పుంసో వామపార్శ్వాత్ కామస్య కామినీ వరా।
బభూవాతీవ లలితా సర్వేషాం మోహకారిణీ।

శ్లో॥ రతిర్బభూవ సర్వేషాం తాం దృష్ట్వా సస్మితాం సతీమ్।
రతీతి తేన తన్నామ ప్రవదన్తి మనీషిణః॥ – ఇతి బ్రహ్మవైవర్తే.

సి) శ్లో॥ ....కామపత్నీ రతిః స్మృతా॥ అని హలాయుధకోశము

డి) శ్లో॥ సాక్షాత్ కామం నవమివ రతిర్మాలతీ మాధవం యత్।
మాలతీమాధవమ్ 1–15

ఇ) శ్లో॥ రతే ర్గృహీతానునయేన కామం
ప్రత్యర్పితస్వాఙ్గమివేశ్వరేణ।

కాకుత్థ్సమాలోకయతాం నృపాణాం
మనో బభూవేన్దుమతీనిరాశమ్॥ ర.వం-6.2

"రతిదేవి యొక్క ప్రార్థనను మన్నించి, శివుడు మన్మథునకు నిజశరీరము నీయగా, ఆ నూతనశరీరము పొందిన మన్మథుడా! అన్నట్లున్న....."

యఫ్) కుమారసంభవమహాకావ్యమున - 3.23వ శ్లోకమును చూడగలరు.

**క్రియాదర్శము:- దీయతే-** దాణ్(దా) దానే (ఇచ్చుట), భ్వాదిప్రకరణమ్, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లట్. కర్మణి ప్రయోగము - ప్రథమపురుషైకవచనాంతః ఆత్మనేపదీ.

రూపాలు - **దీయతే** - దీయేతే - దీయన్తే

---

**శ్లో॥ స్మరసి స్మర! మేఖలాగుణై-**
**రుత గోత్రస్ఖలితేషు బన్ధనమ్।**
**చ్యుతకేసరదూషితేక్షణా-**
**న్యవతంసోత్పలతాడనాని వా?॥ 8**

**పదవిభాగము:-** స్మరసి, స్మర!, మేఖలాగుణైః, ఉత, గోత్రస్ఖలితేషు, బన్ధనమ్, చ్యుతకేసరదూషితేక్షణాని, అవతంసోత్పలతాడనాని, వా।

**అన్వయక్రమము:-** స్మర! గోత్రస్ఖలితేషు మేఖలాగుణైః బన్ధనం స్మరసి ఉత। చ్యుతకేసర దూషితేక్షణాని అవతంసోత్పలతాడనాని స్మరసి వా।

**ప్రతిపదార్థము:-** స్మర! - ఓమన్మథుడా! గోత్రస్ఖలితేషు - పేరియందలి పొరబాటులందు, మేఖలాగుణైః - మొలత్రాటి దారములతో, బన్ధనమ్ - కట్టుటను, స్మరసి ఉత - తలచుచున్నావా?, చ్యుతకేసర దూషితేక్షణాని - రాలిన కేసరములచేత దూషితమైన కన్నులుగలవైన, అవతంసోత్పలతాడనాని - చెవికొననుంచు నల్లకలువలతోడి తాడనములను, స్మరసి వా-తలచుచున్నావా?

**తాత్పర్యము:-** ఓ మన్మథుడా! పేరి యందలి పొరబాటులందు (నన్ను మఱియొకతె పేర పిలిచిన నేరమికై) మొలత్రాటి దారములతో కట్టుటను తలచుచున్నావా? రాలిన కేసరములచేత దూషితమైన కన్నులుగలవైన చెవికొననుంచు నల్లకలువలతోడి తాడనములను తలచుచున్నావా?





**పాఠాన్తరాలు:-** వా-చ

**విభక్తులు/క్రియలు:-** 1. స్మర!-**హే స్మర!,** హే స్మరౌ, హే స్మరాః, అకారాన్తపుంలింగ స్మరశబ్దము సం.ప్ర.ఏ, 2. గోత్రస్ఖలితేషు - గోత్రస్ఖలితే, గోత్రస్ఖలితయో ః, **గోత్రస్ఖలితేషు,** అకారాన్తనపుంసకలింగ గోత్రస్ఖలితశబ్దము స.బ., 3. మేఖలాగుణైః - మేఖలాగుణేన, మేఖలాగుణాభ్యామ్, **మేఖలాగుణైః,** అకారాన్త పుంలింగ మేఖలాగుణశబ్దము తృ.బ., 4. బన్ధనమ్ - **బన్ధనమ్,** బన్ధనే, బన్ధనాని - అకారాన్త నపుంకలింగ బన్ధన శబ్దము, ద్వి.ఏ., 5. స్మరసి - క్రియ-స్మృ(చిన్తాయామ్) - లట్ - మధ్యమపురుషైకవచనాంతః, 6. ఉత, వా-అవ్యయాలు, 7. చ్యుత...ఈక్షణాని....ఈక్షణమ్, ....ఈక్షణే, **...ఈక్షణాని,** అకారాన్తనపుంసకలింగ ...ఈక్షణ శబ్దము ద్వి.బ., 8. అవ...తాడనాని-...తాడనమ్, ...తాడనే, ...తాడనాని, అకారాన్తనపుంసకలింగ ..తాడనశబ్దము ద్వి.బ.

**సమాసాలు:-**

1) గోత్రస్ఖలితేషు - గోత్రే స్ఖలితాని (స.త) గోత్రస్ఖలితాని, తేషు।

2) మేఖలాగుణైః - మేఖలాయా గుణాః (ష.త) మేఖలాగుణాః, తైః।

3) చ్యుతకేసరదూషితేక్షణాని - చ్యుతాశ్చ తే కేసరాః(కర్మధా) చ్యుతకేసరాః। దూషితేక్షణాని - దూషితే ఈక్షణే యేషు (బహువ్రీహి) తాని। చ్యుతకేసరైః దూషితేక్షణాని (తృ.త) చ్యుతకేసరదూషితేక్షణాని।

4) అవతంసోత్పలతాడనాని-అవతంసస్య ఉత్పలాని(ష.త) అవతంసోత్పలాని, అవతంసోత్పలైః, తాడనాని (తృ.త)।

**సంధులు:-**

1) మేఖలాగుణైః + ఉత - మేఖలాగుణైరుత - విసర్గసంధిః।

2) ఈక్షణాని + అవతంతసోత్పల. - ఈక్షణాన్యవతంసోత్పల. - యణాదేశసంధిః

3) అవతంస + ఉత్పల - అవతంసోత్పల - గుణసంధిః।

**యణాదేశసన్ధిః** - ఇకో యణచి (సూ 6-1-74) ఇ, ఉ, ఋ, ఌ వర్ణములకు అసవర్ణమైన అచ్చు పరముగా నున్నప్పుడు క్రమముగా య్,వ్,ర్,ల్ (యణ్) అనునవి ఆదేశమగును.

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

**1. అవతంసః**- (పుం-నపుంసక) ఎ) అవ+తంస్+ఘఞ్

బి) శ్లో॥ కర్ణపూరేఽపి దృశ్యేతే తథోత్తంసావతంసకౌ॥ 554

- అని హలాయుధకోశము

సి) శ్లో॥ అయం సుజాతోఽనుగిరం తమాలః
ప్రవాలమాదాయ సుగన్ధి యస్య।
యవాఙ్కురాపాణ్డుకపోలశోభీ
మయాఽవతంసః పరికల్పితస్తే॥ ర.వం. 13-49

"..... యవాంకురములవలె తెల్లనైన నీ కపోలమునందు ప్రకాశించునట్టి కర్ణావతంసముగా అలంకారమును కల్పించితిని.

డి) శ్లో॥ చిచీషతాం జన్మవతామలఘ్వీం
యశోవతంసాముభయత్ర భూతిమ్।
అభ్యర్థితా బంధుషు తుల్యరూపా
వృత్తిర్విశేషేణ తపోధనానామ్॥ – కిరాతార్జునీయే 3-11

"గొప్ప దైనట్టియు, కీర్తి భూషణముగా గలట్టి, ఇహపరలోకములయందు శ్రేయస్సును సంగ్రహింప నిచ్ఛగించుచున్నట్టి, మనుష్యులకు బంధువుల విషయమై సమానరూపమైన వ్యాపారము ఉచితమైనది. మునులకు నియమముచేత ఉచితమైనది.

**2) ఉత– అవ్యయకోశము(220)**

"ఉత వితర్కబాధార్థప్రశ్న సముచ్చయ పక్షాన్తరపాదపూరణేషు"।

ఎ) ఉతాత్యర్థే వికల్పే చ తర్కే **ప్రశ్నే** సముచ్చయే। ఇతి వాఙ్మయార్ణవః।

బి) వితర్కే – స్థాణురయమ్ **ఉత** పురుషః।

సి) బాధార్థే – 'అపి త్రుట్యద్గజదన్తః పరిణత **ఉత** పర్వతం భిన్ద్యాత్'।

డి) ప్రశ్నే – '**ఉత** దండః ప్రతిష్యతి?'।

ఇ) సముచ్చయే – 'స్వభావో బలవాను**త**'। కిరాతార్జునీయే 5-22 '**ఉత** భీమ **ఉ**తార్జునః'।

యఫ్) పక్షాన్తరే – 'ఏకమేవ వరం పుంసా**ముత** రాజ్యమ్ **ఉతా**శ్రమః।'

జి) పాదపూరణే– 'స సర్వలోకస్య శుభో భవ**త్యుత**'।

హెచ్) అత్యర్థేఽపి–'ధర్మే నష్టే కులం కృత్స్నమధర్మోఽభిభవ**త్యుత**। (గీతా 1-40)

మరిన్ని వివరణములకు 'ఆప్టే' చూడగలరు.

**క్రియాదర్శము :– స్మరసి –** 'స్మృ – చిన్తాయామ్' (స్మరించుట) భ్వాది ప్రకరణమ్(1), సకర్మకమ్ – అనిట్, పరస్మైపదీ. లట్ – మధ్యమపురుషైకవచనాంతః.

రూపాలు – **స్మరసి** – స్మరథః–స్మరథ





**శ్లో॥ 'హృదయే వససీ'తి మత్ప్రియం
యదవోచస్తదవైమి కైతవమ్।
ఉపచారపదం న చేదిదం
త్వమనఙ్గః కథమక్షతా రతిః?॥ 9**

**పదవిభాగము:–** హృదయే, వససి, ఇతి, మత్ప్రియమ్, యత్, అవోచః, తత్, అవైమి, కైతవమ్, ఉపచారపదమ్, న, చేత్, ఇదమ్, త్వమ్, అనఙ్గః, కథమ్, అక్షతా, రతిః

**అన్వయక్రమము:–** హృదయే వససి ఇతి మత్ప్రియం యత్ అవోచః, తత్ కైతవమ్ అవైమి। ఇదమ్ ఉపచారపదం న చేత్ త్వమ్ అనఙ్గః కథం రతిః అక్షతా।

**ప్రతిపదార్థము:–** "హృదయే – ఎదలో, **వససి** – కాపురమున్నావు", ఇతి – అని, మత్ప్రియమ్–నాకు ఇష్టమైన, యత్ – ఏమాటను, **అవోచః**–పలికితివో, తత్ – ఆ మాటను, కైతవమ్ – పొల్లుగా, **అవైమి**–తలంతును, ఇదమ్ – ఈమాట, ఉపచారపదమ్ – ఇచ్చకముగా చెప్పినమాట, న చేత్ – కాదేని, త్వమ్ – నీవు, అనఙ్గః – దేహములేనివాడవు (కాగా), కథమ్ – ఎట్లు, రతిః– రతిదేవి, అక్షతా – నశింపకున్నది.

**తాత్పర్యము:–** (ఓ ప్రాణేశ్వరా!) 'ఎదలో కాపురమున్నావు' అని నాకు ఇష్టమైన ఏమాటను పలికితివో అది పొల్లుగా తలంతును. ఇది ఇచ్చకముగా చెప్పిన మాట కాదేని, నీవు దేహములేని వాడవు (కాగా) ఎట్లు రతిదేవి నశింపకున్నది.

**విభక్తులు/క్రియలు:–** 1. హృదయే – **హృదయే,** హృదయోః, హృదయేషు, అకారాన్త నపుంసకలింగ హృదయశబ్దము స.ఏ, 2. వససి – క్రియ – వస్ – లట్ మధ్యమపురుషైకవచనాంతః, 3. ఇతి, న, చేత్ – అవ్యయాలు, 4. మత్ప్రియమ్ – **మత్ప్రియమ్,** మత్ప్రియే, మత్ప్రియాని, అకారాన్త నపుంసకలింగ మత్ప్రియశబ్దము, ద్వి.ఏ., 5. యత్ – యత్, యే, యాని, దకారాన్తనపుంసకలింగ యత్ శబ్దము, ద్వి.ఏ., 6. అవోచః – క్రియ – లుజ్ – మధ్యమపురుషైకవచనాంతః, 7. తత్ – **తత్,** తే, తాని, దకారాన్తనపుంసకలింగ తత్ శబ్దము, ద్వి.ఏ., 8. కైతవమ్ – కైతవమ్, కైతవే, కైతవాని, అకారాన్త నపుంసకలింగ కైతవశబ్దము, ప్ర.ఏ., 9. అవైమి – అవ + ఇ + లట్ – ఉత్తమపురుషైకవచనాంతః 10. ఇదమ్ – **ఇదమ్**, ఇమే, ఇమాని, మకారాన్త నపుంసకలింగ ఇదమ్ శబ్దము ప్ర.ఏ., 11. ఉపచారపదమ్ – **ఉపచారపదమ్,** ఉపచారపదే, ఉపచారపదాని, అకారాన్త నపుంసకలింగ ఉపచారపదము, ప్ర.ఏ. 12. త్వమ్ – **త్వమ్**, యువామ్, యూయమ్, దకారాన్త పుంలింగయుష్మచ్ఛబ్దము ప్ర.ఏ., 13. అనఙ్గః – అనఙ్గః, అనఙ్గౌ, అనఙ్గాః అకారాన్త పుంలింగ అనఙ్గ శబ్దము ప్ర.ఏ. 14. కథమ్–

అవ్యయము, 15. రతిః-రతిః, రతీ, రతయః - ఇకారాన్త స్త్రీలింగ రతిశబ్దము, ప్ర.ఏ. 16. అక్షతా - అక్షతా, అక్షతే, అక్షతాః, ఆకారాన్త స్త్రీలింగ అక్షతా శబ్దము ప్ర.ఏ.

**సమాసాలు:-**

1) మత్ప్రియమ్ - మమ ప్రియమ్ (ష.త) మత్ప్రియమ్।

2) ఉపచారపదమ్ - ఉపచారస్య పదమ్ (ష.త) ఉపచారపదమ్।

3) అక్షతా - న క్షతా (నఞ్తత్పు.) అక్షతా।

**సంధులు:-**

1) వససి + ఇతి - వససీతి - సవర్ణదీర్ఘ సంధిః।

2) అవోచః + తత్ - అవోచస్తత్ - విసర్గసంధిః।

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

**1. కైతవమ్:- (నపుంసకమ్)**

ఎ) కితవస్య భావః కర్మ వా యువాదిత్వాదణ్।

బి) శ్లో॥ **కైతవం** కపటం కూటం వ్యాజచ్ఛద్మోపధిచ్ఛలమ్।
మిషం నిభం చ నిర్దిష్టం వ్యపదేశశ్చ సూరిభిః॥ 709
- అని హలాయుధకోశము 10 నామములను పేర్కొన్నది.

సి) శ్లో॥ ధర్మః ప్రోజ్ఝితకైతవోఽత్ర పరమో నిర్మత్సరాణాం సతాం
వేద్యం వాస్తవమత్ర వస్తుశివదం తాపత్రయోన్మూలనమ్।
శ్రీమద్భాగవతే మహామునికృతే కిం వా పరైరీశ్వర -
స్సద్యో హృద్యవరుధ్యతేఽత్ర కృతిభిశ్శుశ్రూషుభిస్తత్క్షణాత్॥
శ్రీమద్భాగవతము ప్రథమస్కంధము-2

'మహాముని, జగద్గురువు అగు వ్యాసభగవానునిచే రచింపబడిన ఈ శ్రీమంతమైన భాగవతమునందు మాత్సర్య రహితమైనట్టి, సత్పురుషులయొక్క **కపటము** లేనట్టిదైన ఉత్కృష్టమైన ధర్మము (ఉన్నది.) సత్యమైనదియు, మంగళములొనగూర్చునదియు, మూడు విధములైన తాపములను సమూలముగా నశింపజేయునదియునైన తత్త్వము దీనిలో తెలియదగినది. ఇతరములచే ఫలమేమి? పుణ్యవంతులును వినుట కిచ్ఛగించుచున్నట్టి జనులచేత అప్పుడే మనస్సునందు ఈశ్వరుడు హఠాత్తుగా సాక్షాత్కరించునని తాత్పర్యము - భాగవతసుధాలహరి.



ఈ శ్లోక పూర్తి వ్యాఖ్యానమునకై - మహనీయుడు, పుణ్యపురుషుడు సరస్వతీపుత్ర శ్రీ పుట్టపర్తి నారాయణాచార్యులవారు అందించిన భాగవతసుధాలహరి, ద్వితీయ సంపుటము టి.టి.డి. ప్రచురణను చూడ ప్రార్థన. ఇది ఐదు వ్యాఖ్యల సముల్లసితము. పోతనామాత్యుని అనువాదపద్యముతో వ్యాఖ్యానింపబడి ప్రచురింపబడినది.

**క్రియాదర్శము:-** 1) వససి-వస(వస్) నివాసే (నివసించుట) భ్వాది ప్రకరణమ్(1), అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ. లట్- మధ్యమపురుషైకవచనాంతః।

రూపాలు - **వససి** - వసథః - వసథ

2) **అవోచః**- ఎ) వచ(వచ్) పరిభాషణే (మాట్లాడుట), అకర్మకమ్, అదాది ప్రకరణమ్ (2) లుఙ్-మధ్యమపురుషైకవచనాంతః।

రూపాలు- **అవోచః**- అవోచతమ్ - అవోచత

బి) బ్రూఞ్ (బ్రూ) వ్యక్తాయాం వాచి (మాట్లాడుట) ద్వికర్మకమ్, సేట్ వచ్యాదేశే (ఉభయ) అనిట్, పరస్మైపదీ, అదాది ప్రకరణమ్-2

రూపాలు - **అవోచః**, అవోచతమ్ - అవోచత.

2) **అవైమి** (అవ-ఉపసర్గ) ఇణ్ (ఇ, గతౌ(వెళ్లుట) అదాది ప్రకరణమ్-2, సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, లట్-ఉత్తమపురుషైకవచనాంతః।

రూపాలు - అవైమి -అవేవః - అవేమః

---

**అవతారికా :-** న చ మే కశ్చిద్విచారః కిన్తు లోకశ్శోచ్యత ఇత్యాహ।

నా కొఱకేమియు దుఖము లేదు గాని లోకులకై విచారించుచున్నానని చెప్పుచున్నది.

**శ్లో॥ పరలోకనవప్రవాసినః**
**ప్రతిపత్స్యే పదవీమహం తవ।**
**విధినా జన ఏష వఞ్చిత-**
**స్త్వదధీనం ఖలు దేహినాం సుఖమ్॥ 10**

**పదవిభాగము:-** పరలోకనవప్రవాసినః, ప్రతిపత్స్యే, పదవీమ్, అహమ్, తవ, విధినా, జనః, ఏషః, వంచితః, త్వదధీనమ్, ఖలు, దేహినామ్, సుఖమ్.

**అన్వయక్రమము:–** పరలోకనవప్రవాసినః, తవ, పదవీమ్, అహమ్, ప్రతిపత్స్యే। విధినా ఏష జనః వంచితః దేహినామ్ సుఖం త్వదధీనం ఖలు।

**ప్రతిపదార్థము:–** పరలోకనవప్రవాసినః – పరలోకమునుగూర్చి క్రొత్తగా వెళ్లిన, తవ – నీయొక్క, పదవీమ్ – దారిని, అహమ్ – నేను, ప్రతిపత్స్యే – అనుసరించుచున్నాను, విధినా – దైవముచే, ఏషః+జనః – మనుష్యలోకము, వంచితః – వంచన చేయబడినది, దేహినామ్ – దేహధారులకు, సుఖమ్ – సౌఖ్యము, త్వదధీనమ్ ఖలు – నీ అధీనము గదా!

**తాత్పర్యము:–** పరలోకమునుగూర్చి క్రొత్తగా వెళ్ళిన నీ దారిని నేను అనుసరించుచున్నాను. దైవముచే మనుష్యలోకము వంచన చేయబడినది. దేహధారులకు సౌఖ్యము నీ యధీనము గదా!

**విభక్తులు / క్రియలు:–** 1. పరలోకనవప్రవాసినః – **పరలోకనవప్రవాసినః**, పరలోకనవప్రవాసినోః, పరలోకప్రవాసినామ్, నకారాన్త పుంలింగ పరలోకప్రవాసిన్ శబ్దము, ష.ఏ, 2. తవ – **తవ / తే,** యువయోః / వామ్, యుష్మాకమ్ / వః ; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము, 3. పదవీమ్ – **పదవీమ్,** పదవ్యౌ, పదవీః ; ఈకారాన్త స్త్రీలింగ పదవీశబ్దము. ద్వి.ఏ, 4. అహమ్ – **అహమ్,** ఆవామ్, వయమ్; దకారాన్త పుంలింగ అస్మచ్ఛబ్దము. ప్ర.ఏ, 5. ప్రతిపత్స్యే – క్రియ, ప్రతి + పద్ + ల్రుట్ – ఉత్తమపురుషైకవచనాంతః, 6. విధినా – **విధినా**, విధిభ్యామ్, విధిభిః; ఇకారాన్త పుంలింగ విధిశబ్దము, తృ.ఏ, 7. ఏషః – ఏషః, ఏతౌ, ఏతే; దకారాన్త పుంలింగ ఏతచ్ఛబ్దము. ప్ర.ఏ. 8. జనః – **జనః**, జనౌ, జనాః; అకారాన్త పుంలింగ జన శబ్దము, ప్ర.ఏ, 9. వంచిత – **వంచితః**, వంచితౌ, వంచితాః; అకారాన్త పుంలింగ వంచిత శబ్దము. ప్ర.ఏ, 10. దేహినామ్ – దేహినః, దేహినోః, **దేహినామ్**; నకారాన్త పుంలింగ దేహిన్ శబ్దము. ష.బ, 11. సుఖమ్ – **సుఖమ్,** సుఖే, సుఖాని; అకారాన్త నపుంసకలింగ సుఖ శబ్దము. ప్ర.ఏ, 12. త్వదధీనమ్ – అధిశబ్దస్య శౌణ్డాదిత్వాత్ 'సప్తమీ శౌండైః' ఇతి సమాసః 'అద్యుత్తరపదాత్' ఇతి ఖప్రత్యయః, త్వదధీనమ్, త్వదధీనే, త్వదధీనాని, అకారాన్త నపుంసకలింగ త్వదధీనశబ్దము. ప్ర.ఏ 13. ఖలు – అవ్యయము.

**సమాసాలు:–**

1. పరలోకప్రవాసినః – పరః చాసౌ లోకః (కర్మధా.) పరలోకః , నవః చాసౌ ప్రవాసీ (కర్మధా.), నవప్రవాసీ, పరలోకస్య నవప్రవాసీ (ష.త) పరలోకనవప్రవాసీ, తస్య।
2. త్వదధీనమ్ – త్వయి అధీనమ్ (స.త) త్వదధీనమ్

**సంధులు:–**

1. జనః + ఏషః – జన ఏషః – విసర్గలోపసంధిః।

19



2. ఏషః + వంచితః – ఏష వంచితః – సులోపః।
   సూ – ఏతత్తదోః సులోపోఽకోరనఞ్ సమాసే హలి (సూ. 6–1–132) కకారము లేని ఏతద్ తద్ శబ్దముల మీది సుప్రత్యయము హల్లు పరముగా నున్నప్పుడు లోపించును, నఞ్ సమాసమున ఈ లోపము రాదు.
3. వంచితః + త్వద్ – వంచితస్త్వద్ – విసర్గసంధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**క్రియాదర్శము:** – **ప్రతిపత్స్యే** – ప్రతి – ఉపసర్గ, పద (పద్) గతౌ (నడుచుట) సకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ, దివాది ప్రకరణమ్ (4), ల్రుట్, ఉత్తమపురుషైకవచనాంతః।

**రూపాలు** – ప్రతిపత్స్యే – ప్రతిపత్స్యావహే – ప్రతిపత్స్యామహే

---

**అవతారికా:–** తదేవాహ – దానినే చెప్పుచున్నది.

**శ్లో॥ రజనీతిమిరావగుణ్ఠితే**
**పురమార్గే ఘనశబ్దవిక్లబాః ।**
**వసతిం ప్రియ! కామినాం ప్రియా –**
**స్త్వదృతే ప్రాపయితుం క ఈశ్వరః ॥ 11**

**పదవిభాగము:–** రజనీతిమిరావగుణ్ఠితే, పురమార్గే, ఘనశబ్దవిక్లబాః, వసతిమ్, ప్రియ! కామినామ్, ప్రియాః, త్వత్ ఋతే, ప్రాపయితుమ్, కః, ఈశ్వరః ।

**అన్వయక్రమము:–** ప్రియ! రజనీతిమిరావగుణ్ఠితే పురమార్గే ఘనశబ్దవిక్లబాః ప్రియాః కామినాం వసతిం ప్రాపయితుం త్వత్ ఋతే కః ఈశ్వరః ।

**ప్రతిపదార్థము** :– హే ప్రియ! – ఓ ప్రియుడా!, రజనీతిమిరావగుణ్ఠితే – రాత్రిపూట చీకటిచే ఆవరింపబడిన, పురమార్గే – రాజమార్గమునందు, ఘనశబ్దవిక్లబాః – మేఘగర్జనలచే భయపడినవారగు, ప్రియాః – కాంతలను, కామినామ్ – కాముకుల యొక్క, వసతిమ్ – ఇంటినిగూర్చి, ప్రాపయితుమ్ – చేర్చుటకు, త్వత్ ఋతే – నీవు దప్ప, కః – ఎవ్వడు, ఈశ్వరః – సమర్థుడు.

**తాత్పర్యము :–** ఓ ప్రియుడా! రాత్రిపూట చీకటిచే ఆవరింపబడిన రాజమార్గము నందు మేఘగర్జనలచే భయపడినవారగు కాంతలను కాముకులయొక్క ఇంటిని గూర్చి చేర్చుటకు నీవు దప్ప ఎవ్వడు సమర్థుడు?

**విభక్తులు / క్రియలు:–** 1. ప్రియ – **హే ప్రియ!**, హే ప్రియౌ, హే ప్రియాః; అకారాన్త పుంలింగ ప్రియశబ్దము, సం.ప్ర.ఏ, 2. రజనీ...గుణ్ఠితే – **అవగుణ్ఠితే**.... అవగుణ్ఠితయోః,... అవగుణ్ఠితేషు; అకారాన్త పుంలింగ .. అవగుణ్ఠిత శబ్దము. స.ఏ, 3. పురమార్గే – **పురమార్గే**, పురమార్గయోః, పురమార్గేషు అకారాన్త పుంలింగ పురమార్గ శబ్దము, స.ఏ, 4. ఘనశబ్దవిక్లబాః – ఘనశబ్దవిక్లబామ్, ఘనశబ్దవిక్లబే, ఘనశబ్దవిక్లబాః, ఆకారాన్త స్త్రీలింగ ఘనశబ్దవిక్లబాశబ్దము. ద్వి.బ, 5. ప్రియాః – ప్రియామ్, ప్రియే, **ప్రియాః**; ఆకారాన్త స్త్రీలింగ ప్రియా శబ్దము. ద్వి.బ, 6. కామినామ్ – కామినః, కామినోః, **కామినామ్**; నకారాన్త పుంలింగ కామిన్ శబ్దము. ష.బ, 7. వసతిమ్ – **వసతిమ్**, వసతీ, వసతీః; ఇకారాన్త స్త్రీలింగ వసతి శబ్దము. ద్వి.ఏ, 8. ప్రాపయితుమ్ – ప్ర+ఆప్+ణి+తుమున్, 9. ఋతే – అవ్యయము, 10. కః – **కః**, కౌ, కే మకారాన్త పుంలింగ కిమ్ శబ్దము. ప్ర.ఏ, 11. ఈశ్వరః – **ఈశ్వరః**, ఈశ్వరౌ, ఈశ్వరాః; అకారాన్త పుంలింగ ఈశ్వర శబ్దము. ప్ర.ఏ,

**సమాసాలు :–**

1. రజనీతిమిరావగుణ్ఠితే – రజన్యాః తిమిరమ్ (ష.త) రజనీతిమిరమ్ రజనీతిమిరేణ అవగుణ్ఠితః (తృ.త) రజనీతిమిరావగుణ్ఠితః, తస్మిన్।
2. పురమార్గే – పురస్య మార్గః (ష.త) పురమార్గః, తస్మిన్।
3. ఘనశబ్దవిక్లబాః – ఘనస్య శబ్దాః (ష.త), ఘనశబ్దాః, ఘనశబ్దేభ్యః విక్లబాః (పం.త) ఘనశబ్దవిక్లబాః।

**సంధులు:–**

1. ప్రియాః + త్వత్ – ప్రియాస్త్వత్ – విసర్గసంధిః।
2. త్వత్ + ఋతే – త్వదృతే – జశ్త్వసంధిః।
   జశ్త్వసంధిః – **ఝలాం జశో௨న్తే** (సూ. 8–2–39) అనునాసికాంతస్థ వర్ణములు తప్ప మిగిలిన పదాంతగత హల్లులకు సవర్ణమైన వర్గ తృతీయ వర్ణము (జశ్త్వము) ఆదేశముగ వచ్చును.
3. కః + ఈశ్వరః – క ఈశ్వరః – విసర్గలోపసంధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. విక్లబా** – విక్లబః – విక్లబా – విక్లబమ్ – మూడు లింగాల్లోనూ ఉంటుంది.

ఎ) విక్లవతే ఇతి। వి+ క్లు + పచాద్యచ్। – విహ్వలః

బి) 'శ్లో॥ నూనం సహాయేన వియోగవిక్లబా పురః పురశ్రీరపి నిర్యయౌ తదా'

– ఇతి మాఘే –12– 63





సి) నపుంసకరూపమున – దుఃఖం

డి) శ్లో॥ కిమిదానీమిదం దేవి! కరోతి హృది విక్లబమ్'

– ఇతి రామాయణే – 2–44–25

ఇ) ఈ పద వివరణ సందర్భంగా 'ఆప్టే' – ఈ శ్లోకాన్నే ఉదాహరించినాడు.

ఎఫ్) శ్లో॥ విగ్రహాచ్చ శయనే పరాఙ్ముఖీః
నానునేతుమబలాః స తత్వరే।
ఆచకాంక్ష **ఘనశబ్దవిక్లబాః**
తా వివృత్య విశతీర్భుజాన్తరమ్॥ ర.వం. 19–38

"... మేఘగర్జనవలన భయపడిన ఆ యువతులు తమంతట తనవైపు తిరిగి..."

2) **ఋతే–** అవ్యయకోశము (260)

ఎ) 'వినా, వర్జనమ్' ఇత్యర్థే௨వ్యయమిదం స్వరాదిషు ద్రష్టవ్యమ్।

బి) శ్లో॥ అసఙ్గమద్రిష్వపి సారవత్తయా
న మే త్వదన్యేన విసోఢమాయుధమ్।
అవేహి మాం ప్రీత**మృతే** తురఙ్గమాత్
కిమిచ్ఛసీతి స్ఫుటమాహ వాసవః ॥ ర.వం. 3–63

"...ఈ నా వజ్రాయుధపుదెబ్బను నీవొక్కడవు తప్ప ఇతరులెవ్వరును ఓర్చుకొనజాలరైరి..."

అత్ర 'అన్యారాదితరర్తే' – (2–3–29) ఇతి పంచమీ।

సి) 'శక్తో௨న్యః సహితుం వేగ**మృతే** దేవం పినాకినమ్।' – భారతే ఇత్యత్ర ద్వితీయా తు ఆర్షత్వాత్ సమాధేయా। అస్య వినార్థకత్వాత్ 'పృథగ్వినా నానాభిస్తృతీయాన్యతరస్యామ్' (2–3–32) ఇతి యోగవిభాగేన ప్రకృతస్థలే ద్వితీయాపి సాధురితి కశ్చిత్। యోగవిభాగే ప్రమాణసద్భావే௨పి వినార్థకస్య **'ఋతే'** ఇత్యస్యాపి స్వరూప గ్రహణస్థలే ప్రమాణాభావ ఇతి శాస్త్ర స్థితిః ।

---

**శ్లో॥ నయనాన్యరుణాని ఘూర్ణయన్**
**వచనాని స్ఖలయన్ పదేపదే।**
**అసతి త్వయి వారుణీమదః**
**ప్రమదానామధునా విడమ్బనా॥ 12**

**పదవిభాగము:–** నయనాని, అరుణాని, ఘూర్ణయన్, వచనాని, స్ఖలయన్, పదేపదే, అసతి, త్వయి, వారుణీమదః, ప్రమదానామ్, అధునా, విడమ్బనా।

**అన్వయక్రమము:–** అరుణాని నయనాని ఘూర్ణయన్ పదేపదే వచనాని స్ఖలయన్ ప్రమదానామ్ వారుణీమదః అధునా త్వయి అసతి విడమ్బనా।

**ప్రతిపదార్థము:–** అరుణాని – ఎఱ్ఱని, నయనాని – కండ్లను, ఘూర్ణయన్ – త్రిప్పుచు, పదేపదే – నిరంతరము, వచనాని – మాటలను, స్ఖలయన్ – తడబడజేయుచు, ప్రమదానామ్ – చెలువలకు, వారుణీమదః – సారాయికైపు అధునా – ఇప్పుడు, త్వయి అసతి – నీవు లేనందున, విడమ్బనా – అనుకరణము

**తాత్పర్యము :–** ఎఱ్ఱని కండ్లను త్రిప్పుచు నిరంతరము మాటలను తడబడచేయుచు చెలువులకు సారాయికైపు ఇపుడు నీవు లేనందున అనుకరణము.

**విభక్తులు / క్రియలు :–** 1. అరుణాని – అరుణమ్, అరుణే, **అరుణాని**; అకారాన్త నపుంసకలింగ అరుణ శబ్దము, ద్వి.బ, 2. నయనాని – నయనమ్, నయనే, **నయనాని;** అకారాన్త నపుంసకలింగ నయన శబ్దము, ద్వి.బ, 3. ఘూర్ణయన్ – **ఘూర్ణయన్**, ఘూర్ణయన్తౌ, ఘూర్ణయన్తః ; తకారాన్త పుంలింగ ఘూర్ణయత్ శబ్దము. ప్ర.ఏ, 4. పదే పదే – అవ్యయము, 5. స్ఖలయన్ – స్ఖలయన్, స్ఖలయన్తౌ, స్ఖలయన్తః ; తకారాన్త పుంలింగ స్ఖలయత్ శబ్దము, ప్ర.ఏ, 6. ప్రమదానామ్ – ప్రమదాయాః ప్రమదయోః, ప్రమాదానామ్; ఆకారాన్త స్త్రీలింగ ప్రమదాశబ్దము. ష.బ, 7. వారుణీమదః – **వారుణీమదః** , వారుణీమదౌ, వారుణీమదాః, అకారాన్త పుంలింగ వారుణీమద శబ్దము, ప్ర.ఏ, 8. అధునా – అవ్యయము, 9. త్వయి – త్వయి, యువయోః, యుష్మాసు; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము, స.ఏ, 10. అసతి – **అసతి**, అసతోః, అసత్సు – తకారాన్త పుంలింగ అసత్ శబ్దము. స.ఏ, 11. విడమ్బనా – విడమ్బనా, విడమ్బనే, విడమ్బనాః, ఆకారాన్త స్త్రీలింగ విడమ్బనా శబ్దము. ప్ర.ఏ

**సమాసాలు :–**

1. వారుణీమదః – వారుణ్యాః మదః (ష.త)
2. అసతి – న సన్ (నఞ్తత్పురుష) అసన్, తస్మిన్ అసతి

**సంధులు :–**

1. నయనాని అరుణాని – నయనాన్యరుణాని – యణాదేశసంధిః। ఇకోయణచి (సూ 6–1–74) ఇ,ఉ,ఋ,ఌ వర్ణములకు అసవర్ణమైన అచ్చు పరముగా నున్నపుడు క్రమముగా య్,వ్,ర్,ల్ (యణ్) అనునవి ఆదేశమగును.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

1. **అధునా–** అవ్యయకోశము (40)

**'అధునా అస్మిన్ కాలే ఇత్యర్థే'**



అస్మిన్ కాలే ఇత్యర్థే ఇదం శబ్దాత్ కాలవాచినః సప్తమ్యన్తాత్ స్వార్థే అధునా ప్రత్యయే ప్రకృతేః (ఇదం శబ్దస్య) లోపే చ రూపమేవమ్। అస్యచాసర్వవిభక్తి తద్ధితాన్తత్వాదవ్యయత్వమ్। స్పష్టమిదమ్ 'అధునా' (5–3–17) ఇత్యత్ర భాష్యే కాశికాప్రభృతిషు వృత్తిగ్రన్థేషు ఇదం శబ్దస్య అశ్భావే, ధునాప్రత్యయే చ **అధునా** ఇతి రూపం సాధ్యతే। సిద్ధాన్తకౌముద్యాం తు ఇదం శబ్దస్య ఇశ్భావే అధునాప్రత్యయే 'యస్యేతి చ' (6–4–18) ఇత్యనేన ప్రకృతేరాదేశభూతస్యేకారస్య లోపే చ రూపమేవమన్యథైవ సాధ్యతే।

శ్లో॥ అధ్వరేష్వగ్నిచిత్వత్సు సోమసుత్వవ ఆశ్రమాన్।
అత్తుం మహేన్ద్రియం భాగమైతి దుశ్చ్యవనోఽధునా॥
– భట్టికావ్యే 5–11

2) 'సమ్మోహానన్దసమ్భేదో మదిరాదికృతో మద' ఇతి మదలక్షణమ్.

---

శ్లో॥ అవగమ్య కథీకృతం వపుః
ప్రియబన్ధోస్తవ నిష్ఫలోదయః ।
బహులేఽపి గతే నిశాకర –
స్తనుతాం దుఃఖమనఙ్గ! మోక్ష్యతి॥ 13

**పదవిభాగము:–** అవగమ్య, కథీకృతమ్, వపుః, ప్రియబన్ధోః, తవ, నిష్ఫలోదయః బహులే, అపి, గతే, నిశాకరః, తనుతామ్, దుఃఖమ్, అనఙ్గ! మోక్ష్యతి।

**అన్వయక్రమము:–** అనఙ్గ! ప్రియబన్ధోః తవ వపుః కథీకృతమ్ అవగమ్య నిష్ఫలోదయః నిశాకరః బహులే గతే అపి తనుతాం దుఃఖం మోక్ష్యతి।

**ప్రతిపదార్థము:–** అనఙ్గ ! – ఓ యశరీరుడా!, ప్రియబన్ధోః – ప్రియమిత్రుడవైన తవ – నీయొక్క, వపుః – శరీరమును, కథీకృతమ్ – కథగా చేయబడిన దానినిగా అవగమ్య – తెలిసికొని, నిష్ఫలోదయః – వ్యర్థమైన పొడుపుగలవాడై, నిశాకరః – చంద్రుడు, బహులే – కృష్ణపక్షము, గతే + అపి – కడచినను, తనుతామ్ – కృశత్వమును, దుఃఖమ్ – మనోధర్మవిశేషముగా, మోక్ష్యతి – వదలును.

**తాత్పర్యము:–** ఓ యశరీరుడా! ప్రియమిత్రుడవైన నీయొక్క శరీరమును కథగా చేయబడిన దానినిగా తెలిసికొని, వ్యర్థమైన పొడుపుగలవాడై చంద్రుడు కృష్ణపక్షము

గడచినను కృశత్వమును మనోధర్మవిశేషముగా వదలును. (ఇట క్రమాభివృద్ధితో చంద్రుడు చిక్కియున్నట్లే కనబడుచున్నాడని కాళిదాసు బహు చక్కని కల్పనము గావించినాడు)

**విభక్తులు / క్రియలు** :– 1. అనఙ్గ! – **హే అనఙ్గ!,** హే అనఙ్గౌ! హే అనఙ్గాః; అకారాన్త పుంలింగ అనఙ్గ శబ్దము, సంబోధన ప్ర.ఏ, 2. ప్రియబన్ధోః– **ప్రియబన్ధోః,** ప్రియబన్ధ్వోః, ప్రియబన్ధూనామ్; ఉకారాన్త పుంలింగ ప్రియబన్ధు శబ్దము. ష.ఏ, 3. తవ – తవ / తే, యువయోః / వామ్, యుష్మాకమ్, వః; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము, ష.ఏ, 4. వపుః – **వపుః,** వపుషీ, వపూంషి; సకారాన్త నపుంసకలింగ వపుస్ శబ్దము, ద్వి.ఏ, 5. కథీకృతమ్ – **కథీకృతమ్,** కథీకృతే, కథీకృతాని; అకారాన్త నపుంసకలింగ కథీకృత శబ్దము, ద్వి.ఏ, 6. అవగమ్య – ల్యబన్తము, 7. నిష్ఫలోదయః – **నిష్ఫలోదయః,** నిష్ఫలోదయౌ, నిష్ఫలోదయాః; అకారాన్త పుంలింగ నిష్ఫలోదయ శబ్దము. ప్ర.ఏ, 8. నిశాకరః – **నిశాకరః,** నిశాకరౌ, నిశాకరాః; అకారాన్త పుంలింగ నిశాకర శబ్దము. ప్ర.ఏ, 9. బహులే – బహులే, బహులయోః, బహులేషు; అకారాన్త పుంలింగ బహుళశబ్దము, స.ఏ, 10. గతే – గతే, గతయోః, గతేషు; అకారాన్త పుంలింగ గత శబ్దము. స.ఏ, 11. అపి – అవ్యయము, 12. తనుతామ్ – తనుతామ్, తనుతే, తనుతాః, ఆకారాన్త స్త్రీలింగ తనుతా శబ్దము, ద్వి.ఏ, 13. దుఃఖమ్ –దుఃఖమ్, దుఃఖే, దుఃఖాని; అకారాన్త నపుంసకలింగ దుఃఖ శబ్దము. ప్ర.ఏ 14. మోక్ష్యతి – క్రియ – ముచ్ + ల్ఋట్ – ప్ర.ఏ.

**సమాసాలు** :–

1. అనఙ్గః – నాస్తి అంగాని యస్య (బహువ్రీహి) సః, సంబోధన ప్ర.ఏ.
2. ప్రియబన్ధోః – ప్రియః చాసౌ బన్ధుః, (కర్మధా) తస్య।
3. నిష్ఫలోదయః – ఫలాత్ నిర్గతః నిష్ఫలః (ప్రాదితత్పురుష) నిష్ఫలః ఉదయః యస్య (బహువ్రీహి) సః ।
4. నిశాకరః – నిశాం కరోతి (ఉపపద తత్పురుష) ఇతి సః ।

**సంధులు:–**

1. ప్రియబన్ధోః + తవ – ప్రియబన్ధోస్తవ – విసర్గసంధిః।
2. బహులే + అపి – బహులేఽపి – పూర్వరూప సంధిః।
   **ఏఙః పదాన్తాదతి** (సూ 6–1–05) పదాంతమందున్న ఏ ఓ లకు హ్రస్వ 'అకారము' పరముగా నున్నపుడు పూర్వపరముల స్థానమున పూర్వరూపమేకాదేశమగును.
3. నిశాకరః + తనుతామ్ – నిశాకరస్తనుతామ్ – విసర్గసంధిః।
4. **దుఃఖమ్** – దుః + ఖమ్ – దు ᳵ ఖమ్ (ఏకపదము – నిత్యము) – విసర్గసంధిః జిహ్వామూలీయోపధ్మానీయాదేశః – **కుప్వోᳵకᳵపౌ చ** (సూ

22



8–3–37) క, ఖ, ప, ఫ లు పరముగానున్నప్పుడు విసర్గమునకు అర్ధవిసర్గము ఆదేశమగును. ఏకపదము, ధాతూపసర్గములందు, సమాసమునందును, ఈ ఆదేశము నిత్యము. వాక్యమునందు ఇది వైకల్పికము.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. దుఃఖమ్:–**

ఎ) దుర్ దుష్టం ఖనతీతి । ఖన్ + డ। యద్వా దుఃఖయతీతి । దుఃఖ+పచాద్యచ్।

బి) శ్లో॥ సుఖం **దుఃఖం** చ హర్షం చ శోకం మంగలమాలయమ్।
మయా దత్తం చ తత్త్వం చ యోగినామపి దుర్లభమ్ ॥
– ఇతి బ్రహ్మవైవర్తే.

సి) 'శ్లో॥ ఆబాధా వేదనా దుఃఖమార్తిః పీడా వ్యథా తథా' ।
అని హలాయుధకోశము '6' నామములను అందించినది.

డి) 'శ్లో॥ సింహానాం నినదా **దుఃఖాః** శ్రోతుః దుఃఖమతో వనమ్'
రామాయణమ్

ఇ) శ్లో॥ క్లేశోఽధికతరస్తేషామ్ – అవ్యక్తాసక్తచేతసామ్ ।
అవ్యక్తా హి గతి**ర్దుఃఖం** – దేహవద్భిరవాప్యతే ॥
భగవద్గీత – 12–5

'...ఏలయన దేహాభిమానులకు అవ్యక్తపరబ్రహ్మప్రాప్తి కష్టసాధ్యమే'.

ఎఫ్) శ్లో॥ దృష్టదోషమపి తన్న సోఽత్యజత్
సఙ్గవస్తు భిషజామనాశ్రవః ।
స్వాదుభిస్తు విషయైర్హృతస్తతో
**దుః**ఖమిన్ద్రియగణో నివార్యతే ॥ ర.వం. 19–49

"... ఇంద్రియసమూహము భోగ్యవస్తువులకు అలవాటుపడెనా, ఆ వస్తువుల నుండి ఇంద్రియములు మరలవు, వానిని విడవవు."

**క్రియాదర్శము:– మోక్ష్యతి**– ముచ (ముచ్) మోచనే (విడుచుట) తుదాది ప్రకరణమ్ (6) సకర్మకమ్, అనిట్ (ఉభయ) పరస్మైపదీ, **ల్ఋట్** –ప్రథమపురుషైకవచనాంతః (6 ముచ్, 7 విద్, 8 సిచ్, ధాతువులకు శేముచాదీనామ్ (సూ 7–1–59) అను సూత్రముచే **నుమ్** (న్) ఆగమము చెప్పబడినది. ముచ్ + అ + తి – మున్చ్+ అ + తి – ముంచ్ + అ+ తి (నకారమునకు అనుస్వారము) ముఞ్ చ్+అ+తి (అనుస్వారమునకు పరసవర్ణము) – ముఞ్చతి లట్ ప్రథమపురుషైకవచనాంతః

లృట్ రూపాలు – **మోక్ష్యతి** – మోక్ష్యతః – మోక్ష్యన్తి

---

**శ్లో॥ హరితారుణచారుబన్ధనః**
**కలపుంస్కోకిలశబ్దసూచితః।**
**వద సంప్రతి కస్య బాణతాం**
**నవచూతప్రసవో గమిష్యతి॥ 14**

**పదవిభాగము:–** హరితారుణాచారుబన్ధనః, కలపుంస్కోకిలశబ్దసూచితః, వద, సంప్రతి, కస్య, బాణతామ్, నవచూతప్రసవః, గమిష్యతి।

**అన్వయక్రమము:–** – హరితారుణచారుబన్ధనః కలపుంస్కోకిలశబ్దసూచితః నవచూతప్రసవః సంప్రతి కస్య బాణతాం గమిష్యతి? వద।

**ప్రతిపదార్థము:–** హరితారుణచారుబన్ధనః – ఆకుపచ్చ ఎఱుపురంగులతో కూడిన అందమైన తొడిమగల యట్టియు, కలపుంస్కోకిలశబ్దసూచితః – అవ్యక్తమధురముగా కూయు గండుకోయిలల కూతలచేత సూచించబడినదియు అగు, నవచూత ప్రసవః – క్రొత్త మావిమొగ్గ, సంప్రతి – ఇప్పుడు, కస్య – ఎవ్వనికి, బాణతామ్ – శరమగుటను, గమిష్యతి – పొందెనో, వద – చెప్పుమా!

**తాత్పర్యము** :– ఆకుపచ్చని ఎఱుపురంగులతో కూడిన అందమైన తొడిమగలట్టియు అవ్యక్తమధురముగా కూయు గండు కోయిలల కూతలచేత సూచించబడినదియు అగు క్రొత్త మావి మొగ్గ ఇప్పుడు ఎవ్వనికి శరమగుటను పొందెనో చెప్పుమా! (ఓ యశరీరుడా! నీవు లేకపోవుటచేత నీ చూతాస్త్రము నావలె దిక్కులేనిదాయెను– అని గర్భితము. రతిదేవి తనకొఱకు దుఃఖించుట లేదను స్వారస్యమును కాళిదాసు ఇట ప్రతిపాదించినాడని గమనింతురు గాక!)

**విభక్తులు / క్రియలు:–** 1. హరితా...బన్ధనః ...**బన్ధనః,** బన్ధనౌ... బన్ధనాః; అకారాన్త పుంలింగ...బన్ధనశబ్దము. ప్ర.ఏ, 2. కల...సూచితః...సూచితౌ...సూచితాః...;అకారాన్త పుంలింగ...సూచిత శబ్దము ప్ర.ఏ, 3. నవచూతప్రసవః...ప్రసవః...ప్రసవౌ...ప్రసవాః; అకారాన్త పుంలింగ ప్రసవ శబ్దము ప్ర.ఏ, 4. సంప్రతి – అవ్యయము, 5. కస్య – కస్య, కయోః, కేషామ్; మకారాన్త పుంలింగ కిమ్ శబ్దము. ష.ఏ, 6. బాణతామ్ – **బాణతామ్,** బాణతే, బాణతాః; ఆకారాన్త స్త్రీలింగ **బాణతా** శబ్దము. ద్వి.ఏ, 7. గమిష్యతి – క్రియ – గమ్ + లృట్ – ప్రథమపురుషైక వచనాంతః, 8. వద – క్రియ – వద్ – లోట్ – మధ్యమపురుషైకవచనాంతః.

**సమాసాలు :–**





1. హరితారుణచారుబన్ధనః – హరితఇ్చ అరుణఇ్చ (కర్మధా.) హరితారుణమ్, చారు చ తద్ బన్ధనమ్ (కర్మధా) హరితారుణం చారుబన్ధనమ్ యస్య (బహువ్రీహి) సః।
2. కలపుంస్కోకిలశబ్దసూచితః – పుమాఞ్చాసౌ కోకిలః (కర్మధా.) పుంస్కోకిలః పుంస్కోకిలస్య శబ్దః (ష.త) పుంస్కోకిలశబ్దః, కలః చాసౌ పుంస్కోకిలశబ్దః (కర్మధా.) కలపుంస్కోకిలశబ్దః తేన సూచితః (తృ.త)।
3. నవచూతప్రసవః – చూతస్య ప్రసవః (ష.త) చూతప్రసవః, నవః చాసౌ చూతప్రసవః (కర్మధా) నవచూతప్రసవః।

**సంధులు:–**

1. నవచూతప్రసవః + గమిష్యతి – నవచూతప్రసవో గమిష్యతి – ఉత్వాదేశ సంధిః – **హశి చ** (సూ 6–1–110) అప్లుతమైన హ్రస్వ అకారమునకు పరముగ నున్న **రేఫమునకు** మృదుహల్లులు పరముగా నున్నపుడు ఉత్వము వచ్చును.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. సంప్రతి – అవ్యయము** –1. Now, at present, at this time;

శ్లో॥ అయి! సమ్ప్రతి దేహి దర్శనం
స్మర! పర్యుత్సుక ఏష మాధవః।
దయితాస్వనవస్థితం నృణాం
న ఖలు ప్రేమ చలం సుహృజ్జనే! కు.సం. 4–28
(వివరములకు – ఈ శ్లోకవ్యాఖ్యను చూడగలరు)

2. Rightly, Exactly
3. Immediately, at once

శ్లో॥ సంప్రత్యగస్త్యాశ్రమస్య పన్థానం బ్రూహి – ఉత్తరరామచరితమ్ – అని ఆప్టే మహాశయుడు 2–5/6

**క్రియాదర్శము:–**

**1. గమిష్యతి** – గమ (గమ్), గతౌ (వెళ్లుట), భ్వాది ప్రకరణమ్ (1) సకర్మకమ్, **అనిట్,** పరస్మైపదీ (ఇషు గమి యమాం ఛః (సూ. 7–3–77) అను సూత్రముచే 'మ' కారమునకు 'ఛ' కారాదేశము. గమ్+అ+తి – గఛ్+అ+తి. తుగాగము, శ్చుత్వములచే **గచ్ఛతి** అను రూపమేర్పడును. ఇది లట్ ప్రథమపురుషైకవచనాంతః

ఇతర రూపాణి – **గమిష్యతి** – గమిష్యతః – గమిష్యన్తి
(ఇట గమ్ – అనిట్ అయినను లృట్‌లో 'ఇట్' ఆగమము)

2. **వద** – (వద్) వద – వ్యక్తాయాం వాచి (మాట్లాడుట), అకర్మకమ్, సేట్ , పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్ (1), లోట్ –మధ్యమపురుషైకవచనాంతః।
ఇతర రూపాణి – **వద/వదతాత్**, వదతమ్, వదత

---

**శ్లో॥ అలిపఙ్క్తిరనేకశస్త్వయా**
**గుణకృత్యే ధనుషో నియోజితా।**
**విరుతైః కరుణస్వనైరియం**
**గురుశోకామనురోదితీవ మామ్॥ 15**

**పదవిభాగము** :– అలిపఙ్క్తిః, అనేకశః, త్వయా, గుణకృత్యే, ధనుషః, నియోజితా, విరుతైః, కరుణస్వనైః, ఇయమ్, గురుశోకామ్, అనురోదితి, ఇవ, మామ్।

**అన్వయక్రమము** :– త్వయా అనేకశః ధనుషః గుణకృత్యే నియోజితా ఇయమ్ అలిపఙ్క్తిః కరుణస్వనైః విరుతైః గురుశోకాం మామ్ అనురోదితి ఇవ।

**ప్రతిపదార్థము** :– త్వయా – నీచే, అనేకశః – పలుమార్లు, ధనుషః – వింటికి గుణకృత్యే – అల్లెత్రాడుగా (మంచి పనులయందు), నియోజితా – నియోగింపబడిన ఇయమ్ – ఈ, అలిపఙ్క్తిః – తుమ్మెదలగుంపు, కరుణస్వనైః – దీనస్వరములు గల, విరుతైః – కూజితములచే, గురుశోకామ్ – గొప్ప దుఃఖమునందిన, మామ్ – నన్ను ( నా దుఃఖమును), అనురోదితి ఇవ= అనుసరించి యేడ్చుచున్నదా అన్నట్లున్నది.

**తాత్పర్యము** :– నీచే పలుమార్లు వింటికి అల్లెత్రాడుగా నియోగింపబడిన ఈ తుమ్మెదల గుంపు దీనస్వరములుగల కూజితములచే గొప్ప దుఃఖము నందిన నన్ను అనుసరించి యేడ్చుచున్నదా అన్నట్లు (ఉన్నది.)

**పాఠాన్తరాలు** :– కరుణస్వనైః – కరుణస్వరైః, గుణకృత్యే – గుణకృత్యై, విరుతైః – వితతైః

**విభక్తులు / క్రియలు:–** 1. త్వయా – **త్వయా**, యువాభ్యామ్, యుష్మాభిః;దకారాన్త పుంలింగ





యుష్మచ్ఛబ్దము. తృ.ఏ, 2. అనేకశః – శస్ ప్రత్యయాన్తము – తద్ధితాన్తావ్యయము, 3. ధనుషః – ధనుషః, ధనుషోః, ధనుషామ్ షాన్తో నపుంసకలింగో 'ధనుష్' శబ్దః, ష.ఏ, 4. గుణకృత్యే – **గుణకృత్యే**, గుణకృత్యయోః, గుణకృత్యేషు ;అకారాన్త నపుంసకలింగ గుణకృత్యశబ్దము. స.ఏ. 5. నియోజితా – **నియోజితా**, నియోజితే, నియోజితాః; ఆకారాన్త స్త్రీలింగ నియోజితా శబ్దము. ప్ర.ఏ, 6. ఇయమ్ – **ఇయమ్**, ఇమే, ఇమాః; మకారాన్త స్త్రీలింగ ఇదమ్ శబ్దము. ప్ర.ఏ, 7. అలిపఙ్క్తిః – **అలిపఙ్క్తిః**, అలిపఙ్క్తీ, అలిపఙ్క్తయః, ఇకారాన్త స్త్రీలింగ అలిపఙ్క్తి శబ్దము. ప్ర.ఏ, 8. కరుణస్వనైః – కరుణస్వనేన, కరుణస్వనాభ్యామ్, **కరుణస్వనైః**; అకారాన్త నపుంసకలింగ కరుణస్వనశబ్దము. తృ.బ, 9. విరుతైః – విరుతేన, విరుతాభ్యామ్, **విరుతైః**; అకారాన్త నపుంసకలింగ విరుత శబ్దము. తృ.బ, 10. గురుశోకామ్ – **గురుశోకామ్**, గురుశోకే, గురుశోకాః; ఆకారాన్త స్త్రీలింగ గురుశోకాశబ్దము. ద్వి.ఏ, 11. మామ్ – **మామ్,** ఆవామ్, అస్మాన్ ;దకారాన్త పుంలింగ అస్మచ్ఛబ్దము. ద్వి.ఏ, 12. అనురోదితి – అను+రుదిర్+ లట్ – ప్రథమపురుషైకవచనాంతః।

**సమాసాలు** :–

1. గుణకృత్యే – గుణస్య కృత్యమ్ (ష.త) గుణకృత్యమ్, తస్మిన్।
2. అలిపంక్తిః – అలీనాం పఙ్క్తిః (ష.త)।
3. కరుణస్వనైః– కరుణాః స్వనా యేషు (బహువ్రీహి)తాని కరుణస్వనాని, తైః
4. గురుశోకామ్ – గురుః శోకః యస్యాః (బహువ్రీహి) సా గురుశోకా, తామ్।

**సంధులు** :–

1. అలిపఙ్క్తిః + అనేకశః – అలిపఙ్క్తిరనేకశః – విసర్గసంధిః।
2. అనేకశః + త్వయా –అనేకశస్త్వయా – విసర్గసంధిః।
3. ధనుషః + నియోజితా – ధనుషో నియోజితా – ఉత్వాదేశసంధిః।
4. కరుణస్వనైః + ఇయమ్ – కరుణస్వనైరియమ్ – విసర్గసంధిః।
5. అనురోదితి + ఇవ – అనురోదితీవ – సవర్ణదీర్ఘసంధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు**:–

**1. విరుతమ్ –**

ఎ) 'పరభృతవిరుతం కలం యథా ప్రతివచనీకృతమేభిరీదృశమ్।
– అభిజ్ఞానశాకున్తలే – 4.9

**అలంకారములు** :– ఇట 'ఉత్ప్రేక్షాలంకార'మున్నదని చెప్పదగును.

**లక్షణము**:– 'అధ్యవసాయే వ్యాపారప్రాధాన్యే ఉత్ప్రేక్షా'
– అలంకారసర్వస్వము

అప్రకృతమునందలి గుణక్రియలసంబంధమును ప్రకృతమున ప్రకృతముగా

సంభావించుట యుత్ప్రేక్షాలంకారమగును.

రతిదేవి విలపించుటను తుమ్మెదలగుంపు దీనస్వరములుగల కూజితములచే అనుకరించుచున్నదని సంభావించుటచే నిట 'ఉత్ప్రేక్షాలంకారము' చెప్పదగును.

**క్రియాదర్శము: – అనురోదితి** – అను –ఉపసర్గ, రుదిర్ (అశ్రు), విమోచనే (విలపించుట), అదాది ప్రకరణమ్ (2), పరస్మైపదీ, అకర్మకమ్, సేట్, లట్ ప్రథమ పురుషైకవచనాంతః।

శ్లో॥ కందతి క్రన్దతి క్లన్దత్యస్రయత్యపి **రోదితి**।
బాష్పాయతే విలపతి తేవతే పరిదేవతే।
క్రోశతి క్లిన్దతే క్లిన్దత్యేతే **ద్వాదశ** రోదనే॥ 1–3–73

అని 'ఆఖ్యాతచన్ద్రికా' – 12 తుల్యమైన క్రియారూపాలు అందించినది.

---

**శ్లో॥ ప్రతిపద్య మనోహరం వపుః**
**పునరప్యాదిశ తావదుత్థితః ।**
**రతిదూతిపదేషు కోకిలా–**
**మ్మధురాలాపనిసర్గపణ్డితామ్॥ 16**

**పదవిభాగము :–** ప్రతిపద్య, మనోహరమ్, వపుః, పునః, అపి, ఆదిశ, తావత్, ఉత్థితః, రతిదూతిపదేషు, కోకిలామ్, మధురాలపనిసర్గపణ్డితామ్।

**అన్వయక్రమము** :– తావత్ పునః అపి మనోహరం వపుః ప్రతిపద్య ఉత్థితః మధురాలాపనిసర్గపణ్డితామ్ కోకిలాం రతిదూతిపదేషు ఆదిశ.

**ప్రతిపదార్థము :–** తావత్ – మఱియు, పునః + అపి – ఇంకా, మనోహరమ్ – సుందరమగు, వపుః – దేహమును, ప్రతిపద్య – పొంది, ఉత్థితః – లేచినవాడవై, మధుర – ఆలాపనిసర్గ – పణ్డితామ్ = శ్రావ్యమగు పల్కులయందు స్వభావముచే నేర్పరియగు, కోకిలామ్ – కోకిలాంగనను, రతిదూతిపదేషు – సురతదూతీ స్థానములయందు, ఆదిశ – ఆజ్ఞాపించుము.

**తాత్పర్యము** :– (నాథా!) సుందరమగు దేహమును పొంది లేచినవాడవై శ్రావ్యమగు పల్కులయందు స్వభావముచే నేర్పరియగు కోకిలాంగనను సురతదూతీ స్థానములయందు ఆజ్ఞాపించుము. (ఎక్కడో రతిదేవి అంతరంగంలో మన్మథుడు



అత్యద్భుతసౌందర్యంతో సజీవత్వమును నొందునను విషయము గాఢంగా కలిగి ఉండుట – ఈ శ్లోకమున సూచితమైనదని తలంపదగును.)

**పాఠాన్తరాలు** :– దూతిపదేషు – దూనపదేషు, 2. కోకిలాన్...పండితాన్

**విభక్తులు / క్రియలు :–** 1. తావత్, పునః, అపి – అవ్యయాలు, 2. మనోహరమ్ – **మనోహరమ్**, మనోహరౌ, మనోహరాన్; అకారాన్త పుంలింగ మనోహరశబ్దము. ద్వి.ఏ, 3. వపుః – **వపుః**, వపుషీ, వపూంషి; సకారాన్త నపుంసకలింగ వపుస్ శబ్దము. ద్వి.ఏ, 4. ప్రతిపద్య – ప్రతి + పద్ + క్త్వా – ల్యబన్తము, 5. ఉత్థితః – **ఉత్థితః**, ఉత్థితౌ, ఉత్థితాః; అకారాన్త పుంలింగ ఉత్థిత శబ్దము. ప్ర.ఏ, 6. మధుర... పణ్డితామ్... **పణ్డితామ్**...పణ్డితే, పణ్డితాః ;ఆకారాన్త స్త్రీలింగ...పండితా శబ్దము. ద్వి.ఏ, 7. కోకిలామ్ – **కోకిలామ్**, కోకిలే, కోకిలాః; ఆకారాన్త స్త్రీలింగ కోకిలా శబ్దము. ద్వి.ఏ, 8. రతిదూతిపదేషు – పదే...పదయోః...**పదేషు**; అకారాన్త నపుంసకలింగ ...పదశబ్దము. స.బ, 9. ఆదిశ – ఆ + దిశ + లోట్ – మధ్యమపురుషైకవచనాంతః

**సమాసాలు** :–

1. మనోహరమ్–హరతి ఇతి హరః, మనసః హరః (ష.త) మనోహరః, తమ్।
2. మధురాలాపనిసర్గపణ్డితామ్ – మధురాశ్చ తే ఆలాపాః (కర్మధా.) మధురాలాపాః నిసర్గాత్ పండితా (పం.త), నిసర్గపణ్డితా, మధురాలాపేషు నిసర్గపండితా (స.త) తామ్।
3. రతిదూతిపదేషు – రతేః దూతీ (ష.త) రతిదూతీ, రతిదూతేః పదాని (ష.త) రతిదూతి పదాని, తేషు।
అపి మాషం మషం కుర్యాచ్ఛన్దోభఙ్గం త్యజేద్గిరమితి పిఙ్గలాచార్యోక్తానుసారం జీబన్తస్య దూతీశబ్దస్య ఛందోభఙ్గభియా హ్రస్వః, కిఞ్చ ఉణాదయో బహుళమితి బహులవచనాత్ హ్రస్వ ఇతి వల్లభః।

**సంధులు** :–

1. పునః + అపి – పునరపి – విసర్గసంధిః।
2. అపి + ఆదిశ – అప్యాదిశ – యణాదేశసంధిః।
3. తావత్ + ఉత్థితః – తావదుత్థితః – జశ్త్వసంధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు :–**

**1. కోకిలః, కోకిలా :–**

ఎ) కుక్ ఆదానే + 'సలికల్యనిమహిభడిభణ్డిశణ్డిపిణ్డితుణ్డికుకిభూభ్య ఇలచ్ ఇతి ఇలచ్।

బి) 'కోకిలః శ్లేష్మలో జ్ఞేయః పిత్తసంశమనస్తథా' – ఇతి హారితే ।స్థానే॥ అధ్యాయే

– అని హలాయుధకోశవ్యాఖ్య

సి) శ్లో॥ "అన్యభృతః పరపుష్టః కలకణ్ఠః కోకిలః పికః ప్రోక్తః"।

– అని హలాయుధకోశము '5' నామములను అందించినది.

డి) శ్లో॥ లక్ష్మణః ప్రథమం శ్రుత్వా **కోకిలా**మఞ్జువాదినీమ్।
శివాఘోరస్వనాం పశ్చాత్ బుబుధే వికృతేతి తామ్॥ ర.వం. 12-39

'మొదట కోకిలవలె మధురముగా సంభాషించి, పిమ్మట నక్కవలె కర్ణకఠోరముగా భాషించిన దానిని (శూర్పణఖను) లక్ష్మణుడు గుర్తించెను'.

ఇ) ఘోరస్వనా – అదన్తత్వాట్టాప్ కోకిలా – అజాదిత్వాట్టాప్.

సూ :– **అజాద్యతష్టాప్ (4-1-4)**

అజాదీనామకారాన్తస్య చ స్త్రియాం టాప్ స్యాత్। అజాదిగణపాఠః। అధ్యాయః 4 పాదః – అని 'పాణినిసూత్రవ్యాఖ్యా' – Vol I

**క్రియాదర్శము: – ఆదిశ** – ఆ. ఉపసర్గతో కూడిన ఈ ధాతువునకు 'ఆజ్ఞాపించుట' అని అర్థము. దిశ – అతిసర్జనే. సకర్మకమ్, అనిట్ (ఉభయ) పరస్మైపదీ. తుదాదయః లోట్ – మధ్యమపురుషైకవచనాంతః।

ఇతరరూపాణి – **ఆదిశ** / ఆదిశతాత్ – ఆదిశతమ్ – ఆదిశత

---

**అవతారికా: –** అథ రతి ఇత్థం ప్రలాపం వ్యర్థం జ్ఞాత్వా భూయః పూర్వానుభవాన్ సంస్మరతి –

**శ్లో॥ శిరసా ప్రణిపత్య యాచితా –**
**న్యుపగూఢాని సవేపథూని చ।**
**సురతాని చ తాని తే రహ–**
**స్స్మర! సంస్మృత్య న శాన్తిరస్తి మే॥ 17**

**పదవిభాగము** :– శిరసా, ప్రణిపత్య, యాచితాని, ఉపగూఢాని, సవేపథూని, చ, సురతాని, చ, తాని, తే, రహః, స్మర!, సంస్మృత్య, న, శాన్తిః, అస్తి, మే।

**అన్వయక్రమము:–** స్మర! తే శిరసా ప్రణిపత్య యాచితాని సవేపథూని ఉపగూఢాని చ తాని రహః సురతాని చ సంస్మృత్య మే శాన్తిః న అస్తి।

**ప్రతిపదార్థము** :– స్మర! – ఓ మన్మథుడా!, తే – నీయొక్క, శిరసా – తలతో,





ప్రణిపత్య – ప్రణమిల్లి, యాచితాని – వేడుటలును, సవేపథూని – వణుకుతో కూడిన, ఉపగూఢానిచ – కౌగిలింతలును, తాని – ఆ, రహః – ఏకాంతమందలి సురతాని చ – సురతములును, సంస్మృత్య – తలచుకొనగా, మే – నాకు, శాన్తిః – కామక్రోధాదిరాహిత్యము, న + అస్తి – కలుగుట లేదు.

**తాత్పర్యము** :– ఓ మన్మథుడా! నీయొక్క తలతో ప్రణమిల్లి వేడుటలును, వణుకుతో కూడిన కౌగిలింతలును, ఆ యేకాంతమందలి సురతములును తలచుకొనగా నాకు కామక్రోధాదిరాహిత్యము కలుగుట లేదు.

**విభక్తులు / క్రియలు :–** 1. స్మర! – హే స్మర!, హే స్మరౌ!, హే స్మరాః!; అకారాన్త పుంలింగ స్మరశబ్దము. సంబోధన ప్ర.ఏ, 2. తే – **తే / తేవ**, యువయోః / వామ్, యుష్మాకమ్ / వః; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము. ష.ఏ, 3. శిరసా – **శిరసా**, శిరోభ్యామ్, శిరోభిః; సకారాన్త నపుంసకలింగ శిరస్ శబ్దము. తృ.ఏ, 4. ప్రణిపత్య – ప్ర + ని + పత్ + క్త్వా – ల్యబన్తము, 5. సంస్మృత్య – సమ్ + స్మృ + క్త్వా – ల్యబన్తము, 6. యాచితాని – యాచితమ్, యాచితే, **యాచితాని**; అకారాన్త నపుంసకలింగ యాచిత శబ్దము. ద్వి.బ, 7. సవేపథూని – సవేపథు, సవేపథునీ, **సవేపథూని**; ఉకారాన్త నపుంసకలింగ సవేపథు శబ్దము. ద్వి.బ, 8. ఉపగూఢాని – ఉపగూఢమ్, ఉపగూఢే, **ఉపగూఢాని**; అకారాన్త నపుంసకలింగ ఉపగూఢ శబ్దము. ద్వి.బ, 9. సురతాని – సురతమ్, సురతే, **సురతాని**; అకారాన్త నపుంసకలింగ సురత శబ్దము. ద్వి.బ, 10. తాని – తత్, తే, **తాని;** దకారాన్త నపుంసకలింగ తచ్ఛబ్దము. ద్వి.బ, 11. రహః – సకారాంతము – అవ్యయము 12. మే – **మమ / మే**, ఆవయోః / నౌ, అస్మాకమ్ / నః, దకారాన్త పుంలింగ 'అస్మ' చ్ఛబ్దము., 13. శాన్తిః – శాన్తిః, శాన్తీ, శాన్తయః; ఇకారాన్త స్త్రీలింగ శాన్తిశబ్దము. ప్ర.ఏ, 14. అస్తి – క్రియ, 15. న – అవ్యయము.

**సమాసాలు :–**

1. సవేపథూని – వేపథునా సహితాని సవేపథూని (బహువ్రీహి)।

**సంధులు :–**

1. యాచితాని + ఉపగూఢాని – యాచితాన్యుపగూఢాని – యణాదేశసంధిః
2. రహః + స్మర – రహస్స్మర – విసర్గసంధిః।
3. శాన్తిః + అస్తి – శాన్తిరస్తి – విసర్గసంధిః।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1)ఏ) సురతాని**

శ్లో॥ ఆశ్లేషం ప్రథమం కుర్యాత్ ద్వితీయం చుంబనం తథా
తృతీయం నఖదానం చ దంష్ట్రాఘాతం చతుర్థకమ్ ।
పంచమం క్షేపణం ప్రోక్తం షష్ఠం ప్రహరణం తథా

సప్తమం కంఠశబ్దశ్చ బంధాఖ్యం చాష్టమం స్మృతమ్ ।

ఇందు అష్టవిధ రతములు చెప్పబడియున్నవి. మన్మథుడు ఇకలేడను విషయమునుండి రతిదేవి తేఱుకొనుట అతిదుర్గమముగా నున్నదని ఇట ప్రతిపాదించబడినదని గ్రహింతురుగాక. దానికి తోడు తామిదివఱకు ఏకాంతమున గడపిన సంయోగశృంగారచేష్టలు మదిని వీడకుండుట అత్యన్త దుర్భరముగ నున్నదనియు ప్రతిపాదించబడినది.

2) ఎ) సవేపథుపదేన సాత్త్వికభావా అన్యేఽపృపలక్షితా జ్ఞేయాః – తథా చ

శ్లో॥ స్తమ్భః స్వేదోఽథరో మాఞ్చః స్వరభఙ్గోఽథ వేపథుః ।
వైవర్ణ్యమశ్రుప్రలయ ఇత్యష్టౌ సాత్త్వికాః మతాః ॥ ఇతి॥

బి) అథ వేపథుః కమ్పు ఇతి శమథస్తు శమః శాన్తిరితి చామరః ।

సి) సాత్వికాన్తరోపలక్షణమేతత్ –

"శ్లో॥ స్తమ్భప్రలయరోమాంచాః స్వేదో వైవర్ణ్యవేపథూ।
అశ్రువైస్వర్యమిత్యష్టౌ సాత్త్వికా పరికీర్తితాః ॥"

– అని 'సంజీవనీ వ్యాఖ్య' పేర్కొన్నది.

**క్రియాదర్శము:– అస్తి,** అస (అస్) భువి (ఉండుట) అదాదిప్రకరణమ్(2), అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ. లట్ – ప్రథమపురుషైకవచనాంతః। ఇతరరూపాణి – **అస్తి** – స్తః – సన్తి

---

**శ్లో॥ రచితం రతిపణ్డిత! త్వయా**
**స్వయమఙ్గేషు మమేదమార్తవమ్।**
**ధ్రియతే కుసుమప్రసాధనం**
**తవ తచ్చారు వపుర్న దృశ్యతే॥ 18**

**పదవిభాగము :–** రచితమ్, రతిపణ్డిత! త్వయా, స్వయమ్, అఙ్గేషు, మమ, ఇదమ్, ఆర్తవమ్, ధ్రియతే, కుసుమప్రసాధనమ్, తవ, తత్, చారు, వపుః, న, దృశ్యతే।

**అన్వయక్రమము :–** రతిపణ్డిత! త్వయా మమ అంగేషు స్వయం రచితమ్ ఆర్తవం కుసుమప్రసాధనమ్ ఇదం ధ్రియతే! తవ తత్ చారు వపుః న దృశ్యతే!

**ప్రతిపదార్థము :–** హే రతిపణ్డిత! – ఓ సురతప్రవీణుడా!, త్వయా – నీ చేత,





మమ – నాయొక్క, అంగేషు – అవయవములయందు, స్వయమ్ – స్వయముగా రచితమ్ – చేయబడిన, ఆర్తవమ్ – ఋతుసంబంధమగు, కుసుమప్రసాధనమ్ – కుసుమపత్రాద్యలంకారశోభ, ఇదమ్ – ఇదిగో, ధ్రియతే – నిలిచియున్నది, తవ – నీయొక్క, తత్ – ఆ, చారు – అందమైన, వపుః – దేహము, న దృశ్యతే – కనబడుచున్నది కాదు.

**తాత్పర్యము :–** ఓ సురతప్రవీణుడా! నీ చేత నా అవయవములయందు స్వయముగా చేయబడిన ఋతుసంబంధమగు కుసుమపత్రాద్యలంకారశోభ ఇదిగో నిలిచియున్నది. నీయొక్క ఆ అందమైన దేహము కనబడుచున్నది కాదు.

**పాఠాన్తరములు :–** స్వయమ్ – నవమ్

**విభక్తులు / క్రియలు :–** 1. రతిపణ్డిత! – **హే రతిపణ్డిత!,** హే రతిపణ్డితౌ, హే రతిపణ్డితాః; అకారాన్త పుంలింగ రతిపణ్డిత శబ్దము. సం.ప్ర.ఏ, 2. త్వయా – **త్వయా**, యువాభ్యామ్, యుష్మాభిః ; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము. త.ఏ, 3. మమ – **మమ**, ఆవయోః, అస్మాకమ్; దకారాన్త పుంలింగ 'అస్మ'చ్ఛబ్దము ష.ఏ, 4. అంగేషు – **అంగే**, అంగయోః, అంగేషు; అకారాన్త నపుంసకలింగ అంగశబ్దము స.బ, 5. స్వయమ్ – అవ్యయము, 6. రచితమ్ – **రచితమ్**, రచితే, రచితాని; అకారాన్త నపుంసకలింగ రచిత శబ్దము. ప్ర.ఏ, 7. ఆర్తవమ్ – **ఆర్తవమ్**, ఆర్తవే, ఆర్తవాని; అకారాన్త నపుంసకలింగ ఆర్తవశబ్దము. ప్ర.ఏ, 8. కుసుమప్రసాధనమ్ –... **ప్రసాధనమ్**, ... ప్రసాధనే, ...ప్రసాధనాని; అకారాన్త నపుంసకలింగ ...ప్రసాధన శబ్దము. ప్ర.ఏ, 9. ఇదమ్ – **ఇదమ్**, ఇమే, ఇమాని; మకారాన్త నపుంసకలింగ 'ఇదమ్' శబ్దము. ప్ర.ఏ, 10. ధ్రియతే – ధృ+లట్ – ప్రథమపురుషైకవచనము, 11. తవ – **తవ**, యువయోః, యుష్మాకమ్; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము, ష.ఏ, 12. తత్ – **తత్**, తే, తాని; దకారాన్త నపుంసకలింగ 'తత్'శబ్దము. ప్ర.ఏ, 13. చారు – **చారు**, చారుణీ, చారూణి; ఉకారాన్త నపుంసకలింగ చారుశబ్దము. ప్ర.ఏ, 14. వపుః – వపుః, వపుషీ, వపూంషి; సకారాన్త నపుంసకలింగ వపుస్ శబ్దము. ప్ర.ఏ, 15. న – అవ్యయము, 16. దృశ్యతే – (కర్మణి ప్రయోగము) క్రియ. ప్ర.ఏ

**సమాసాలు:–**

1. రతిపణ్డిత – రతౌ పణ్డితః (స.త) రతిపణ్డితః, సంబోధన ప్రథమా।
2. కుసుమప్రసాధనమ్ – కుసుమానాం ప్రసాధనమ్ (ష.త) కుసుమప్రసాధనమ్।

**సంధులు:–**

1. మమ + ఇదమ్ – మమేదమ్ – గుణసన్ధిః – ఆద్గుణః (సూ.6–1–84)
2. తత్ + చారు – తచ్చారు – శ్చుత్వసన్ధిః – స్తోః శ్చునా శ్చుః (సూ8–4–39)
3. వపుః + న–వపుర్న–రుత్వమ్–విసర్గసంధిః – ససజుషో రుః (సూ. 8–2–66)

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. పణ్డితః**

ఎ) పుం. పణ్డా వేదోజ్జ్వలా తత్త్వవిషయిణీ వా బుద్ధిః,
సా జాతా అస్య। 'తదస్య సంజాతం తారకాదిభ్య ఇతచ్' ఇతి ఇతచ్।
యద్వా పణ్డ్యతే తత్త్వజ్ఞానం ప్రాప్యతేఽస్మాత్। గత్యర్థేతి క్త।

బి) శ్లో॥ నిషేవతే ప్రశస్తాని నిన్దితాని న సేవతే।
అనాసిక్తః శ్రద్దధాన ఏతత్ పణ్డితలక్షణమ్॥
–అని 'చిన్తామణి' పేర్కొన్నదని హలాయుధకోశవ్యాఖ్య

సి) శ్లో॥ పాఠకాః పాఠకాశ్చైవ యే చాన్యే శాస్త్రచిన్తకాః ।
సర్వే వ్యసనినో మూర్ఖా యః క్రియావాన్ స పణ్డితః ॥
– ఇతి మహాభారతే వనపర్వణి.

డి) శ్లో॥ విద్యావినయసంపన్నే బ్రాహ్మణే గవి హస్తిని।
శుని చైవ శ్వపాకే చ **పండితాః** సమదర్శినః ॥
– భగవద్గీత 5–18

**పండితాః(జ్ఞానులు)** విద్యావినయసంపన్నుడైన బ్రాహ్మణునియందును, గోవు, ఏనుగు, కుక్క మొదలగు వానియందును, చండాలునియందును సమదృష్టి కలిగియుందురు.

ఇ) పండితుడు సమదర్శనుడై సర్వత్ర సర్వభూతములయందు పరమాత్మను సందర్శించునని **'ఉత్తరగీత'** తెలుపుచున్నది.

శ్లో॥ అగ్నిర్దేవో ద్విజాతీనాం మునీనాం హృది దైవతమ్।
ప్రతిమా స్వల్పబుద్ధీనాం సర్వత్ర సమదర్శినామ్॥

**క్రియాదర్శము :–** 1. **ధ్రియతే** – 'ధృఙ్ – అవస్థానే అకర్మకమ్, అనిట్, ఆత్మనేపదీ, లట్ – ప్రథమపురుషైకవచనాంతః

ప్రథమపురుష రూపాలు – **ధ్రియతే** – ధ్రియేతే – ధ్రియన్తే

శ్లో॥ సురతశ్రమసంభృతో ముఖే
**ధ్రియతే** స్వేదలవోద్గమోఽపి తే।
అథ చాస్తమితా త్వమాత్మనా
ధిగిమాం దేహభృతామసారతామ్ ॥ ర.వం. 8–51

'సంభోగముయొక్క అలసటచేత కలిగిన చెమట చుక్కల పుట్టుక గూడా నీ ముఖము





మీద ఇంకను ఉన్నది....'

బి) శ్లో॥ '**ధ్రియతే** యావదేకోఽపి రిపుస్తావత్కుతః సుఖమ్'
అని – శిశుపాలవధ (2–35)

2. దృశ్యతే – 'దృశిర్ – ప్రేక్షణే' – సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ – భ్వాదయః కర్మణి ప్రయోగము. లట్ – ప్రథమపురుషైకవచనాంతః।

**దృశ్యతే** – దృశ్యేతే – దృశ్యన్తే

---

**శ్లో॥ విబుధైరసి యస్య దారుణై –**
**రసమాప్తే పరికర్మణి స్మృతః ।**
**తమిమం కురు దక్షిణేతరం**
**చరణం నిర్మితరాగమేహి మే ॥ 19**

**పదవిభాగము:–** విబుధైః, అసి, దారుణైః, అసమాప్తే, పరికర్మణి, స్మృతః, తమ్, ఇమమ్, కురు, దక్షిణేతరమ్, చరణమ్, నిర్మితరాగమ్, ఏహి, మే।

**అన్వయక్రమము:–** దారుణైః విబుధైః యస్య పరికర్మణి అసమాప్తే స్మృతః అసి తమ్ ఇమం మే దక్షిణేతరం చరణం నిర్మితరాగం కురు। ఏహి।

**ప్రతిపదార్థము:–** దారుణైః – క్రూరులగు, విబుధైః – దేవతలచేత, యస్య – ఏ నా పాదముయొక్క, పరికర్మణి – అలంకరించుటయందు, అసమాప్తే – పూర్తికాని దగుచుండగా, స్మృతః – తలంపబడినవాడవు, అసి – అయితివో, తమ్ – ఆ ఇమమ్ – ఈ, మే – నాయొక్క, దక్షిణేతరమ్ – ఎడమ, చరణమ్ – పాదమును నిర్మితరాగమ్ – పూయబడిన పారాణిగలదానినిగా, కురు–చేయుము, ఏహి–రమ్ము

**తాత్పర్యము:–** క్రూరులగు దేవతలచేత ఏ నా పాదముయొక్క అలంకరించుటయందు పూర్తికానిదగుచుండగా తలంపబడిన వాడవయితివో ఆ యీ నా యెడమపాదమును పూయబడిన పారాణిగల దానినిగా చేయుము. రమ్ము.

(రతిమన్మథుల ముచ్చట తీరకమునుపే దేవతలు మదనుని తలచిరని భావము.)

**పాఠాన్తరములు :–** 1. అసి యస్య దారుణైః – అపి యత్సుదారుణైః, 2.తమిమమ్ – తదిదమ్, 3. పరి – ప్రతి.

**విభక్తులు / క్రియలు** :– 1. దారుణైః – దారుణేణ, దారుణాభ్యామ్, **దారుణైః**; అకారాన్త పుంలింగ దారుణశబ్దము. తృ.బ, 2. విబుధైః – విబుధేన, విబుధాభ్యామ్, **విబుధైః**; అకారాన్త పుంలింగ విబుధశబ్దము. తృ.బ, 3. యస్య – **యస్య**, యయోః, యేషామ్; దకారాన్త పుంలింగ యచ్ఛబ్దము. ష.ఏ, 4. పరికర్మణి – **పరికర్మణి**, పరికర్మణోః, పరికర్మసు; నకారాన్త నపుంసకలింగ కర్మన్‌శబ్దము. స.ఏ, 5. అసమాప్తే – **అసమాప్తే,** అసమాప్తయోః, అసమాప్తేషు; అకారాన్త పుంలింగ అసమాప్త శబ్దము. 6. స్మృతః – **స్మృతః**, స్మృతౌ, స్మృతాః; అకారాన్త పుంలింగ స్మృతశబ్దము. ప్ర.ఏ 7.అసి – క్రియ – లట్ – మ.ఏ, 8. తమ్ – **తమ్**, తౌ, తాన్; దకారాన్త పుంలింగ తచ్ఛబ్దము. ద్వి.ఏ, 9. ఇమమ్ – **ఇమమ్**, ఇమౌ, ఇమాన్; మకారాన్త పుంలింగ ఇదమ్ శబ్దము. ద్వి.ఏ, 10. మే – **మే**, నౌ, నః; దకారాన్త పుంలింగ అస్మచ్ఛబ్దము. ష.ఏ, 11. దక్షిణేతరమ్ – **దక్షిణేతరమ్**, దక్షిణేతరౌ, దక్షిణేతరాన్; అకారాన్త పుంలింగ దక్షిణేతర శబ్దము. ద్వి.ఏ, 12. చరణమ్ – **చరణమ్,** చరణౌ, చరణాన్; అకారాన్త పుంలింగ చరణ శబ్దము. ద్వి.ఏ, 13. నిర్మితరాగమ్ – **నిర్మితరాగమ్,** నిర్మితరాగౌ, నిర్మితరాగాన్; అకారాన్త పుంలింగ నిర్మితరాగశబ్దము. ద్వి.ఏ, 14. కురు – క్రియ , 15. ఏహి – క్రియ.

**సమాసాలు :–**

1. విబుధైః – విశేషేణ బుధ్యన్తే (ప్రాదితత్పురుష) ఇతి విబుధాః తైః ।
2. అసమాప్తే – న సమాప్తః (నఞ్ తత్పురుష) అసమాప్తః, తస్మిన్ ।
3. దక్షిణేతరమ్ – దక్షిణాత్ ఇతరః (పం.త) దక్షిణేతరః, తమ్।
4. నిర్మితరాగమ్ –నిర్మితః రాగః యస్మిన్ (బహువ్రీహి) సః నిర్మితరాగః తమ్।

**సంధులు :–**

1. విబుధైః + అసి – విబుధైరసి – విసర్గసంధిః (రుత్వమ్)।
2. దారణైః + అసమాప్తే – దారుణైరసమాప్తే – విసర్గసంధిః (రుత్వమ్)।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. విబుధః**

ఎ) విశేషేణ బుధ్యతే ఇతి । వి + బుధ్ + క।

బి) 1. విబుధః పండితే దేవే – అని విశ్వకోశము

2. 'అమరా నిర్జరా దేవాస్త్రిదశా విబుధాః సురాః' ఇత్యమరః

సి) శ్లో॥ గన్ధర్వా గుహ్యకా యక్షా **విబుధానుచరాశ్చ** యే।
తథైవాప్సరసస్సర్వా రాజసీషూత్తమా గతిః ॥
–ఇతి మనుస్మృతి 12–47

గంధర్వులు, గుహ్యకులు, యక్షులు, **దేవానుచరులగు** విద్యాధరులు అప్సరసలు వీరు రాజసులలో నుత్తమజన్ములు.



డి) శ్లో॥ అభూన్నృపో **విబుధ**సఖః పరన్తపః
శ్రుతాన్వితో దశరథ ఇత్యుదాహృతః । – భట్టి కావ్యమ్ 1–1

**క్రియాదర్శము :–**

1)ఎ) **అసి** – అస (అస్) భువి (ఉండుట) – అకర్మకమ్, అనిట్, పరస్మైపదీ – అదాది ప్రకరణమ్ (2) లట్ – మధ్యమపురుష ఏకవచనము.
**అసి** – స్థః – స్థ

2. **కురు** – డు కృఞ్ (కృ) కరణే, చేయుట – సకర్మకమ్, అనిట్, (ఉభయ) పరస్మైపదీ, తనాదిప్రకరణమ్(8), లోట్ – మధ్యమపురుషైకవచనము రూపాలు – **కురు / కురుతాత్** – కురుతమ్ – కురత

3. **ఏహి** – ఆ – ఉపసర్గ, ఇణ్ (ఇ) గతౌ (వెళ్లుట) సకర్మకమ్, అనిట్ పరస్మైపదీ, అదాదిప్రకరణమ్, లోట్, మధ్యమపురుష ఏకవచనము రూపాలు – ఆ + ఇహి / **ఏహి** – ఆ + ఇతమ్ / ఏతమ్ – ఆ + ఇత / ఏత

---

**శ్లో॥ అహమేత్య పతఙ్గవర్త్మనా**
**పునరఙ్కాశ్రయిణీ భవామి తే ।**
**చతురైస్సురకామినీజనైః**
**ప్రియ! యావన్న విలోభ్యసే దివి॥ 20**

**పదవిభాగము:–** అహమ్, ఏత్య, పతఙ్గవర్త్మనా, పునః, అఙ్కాశ్రయిణీ, భవామి, తే, చతురైః, సురకామినీజనైః, ప్రియ! యావత్, న, విలోభ్యసే దివి।

**అన్వయక్రమము:–** అహం పతఙ్గవర్త్మనా ఏత్య పునః తే అఙ్కాశ్రయిణీ భవామి। ప్రియ! దివి చతురైః సురకామినీజనైః యావత్ న విలోభ్యసే ।

**ప్రతిపదార్థము:–** అహమ్ = నేను, పతఙ్గవర్త్మనా – మిడుత మార్గమున, ఏత్య – వచ్చి, పునః – మరల, తే – నీయొక్క, అఙ్కాశ్రయిణీ – ఒడిని చేరినదానను, భవామి – అయ్యెదను, ప్రియ! – ఓ నాథుడా!, దివి – స్వర్గమునందు, చతురైః – జాణలగు, సురకామినీజనైః – అప్సరసల సమూహములచేత, యావత్ – ఎంతలో న విలోభ్యసే – మోహితుడవు కావో!

**తాత్పర్యము :–** నేను మిడుత మార్గమున నీ ఒడిని చేరినదానను అయ్యెదను. ఓ

నాథుడా! స్వర్గమునందు జాణలగు అప్సరసల సమూహములచేత ఎంతలో మోహితుడవుకావో! (అంతలో నిన్ను చేరెదననుట)

**పాఠాన్తరాలు :–** 1. ఆశ్రయణీ – అశ్రయిణీ, 2. విలోభ్యసే – విలుప్యసే, వికల్ప్యసే

**విభక్తులు / క్రియలు** :– 1. అహమ్ – **అహమ్**, ఆవామ్, వయమ్; దకారాన్త పుంలింగ 'అస్మచ్ఛబ్దము. ప్ర.ఏ, 2. పతఙ్గవర్త్మనా – **పతఙ్గవర్త్మనా** – పతఙ్గవర్త్మభ్యామ్, పతఙ్గవర్త్మభిః; నకారాన్త నపుంసకలింగ పతఙ్గవర్త్మన్ శబ్దము. తృ.ఏ, 3. ఏత్య – అవ్యయము – ల్యబన్తము – ఆ+ఇ+క్త్వా, 4. పునః – అవ్యయము, 5. తే – తే, వామ్, వః; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము. ష.ఏ, 6. **అఙ్కాశ్రయణీ** – అఙ్కాశ్రయణీ – అఙ్కాశ్రయణ్యౌ – అఙ్కాశ్రయణ్యః ఈకారాన్త స్త్రీలింగ అంకాశ్రయణీ శబ్దము. ప్ర.ఏ, 7. ప్రియ – **హే ప్రియ!,** హే ప్రియౌ, హే ప్రియాః; అకారాన్త పుంలింగ ప్రియశబ్దము. సంబోధన ప్ర.ఏ, 8. భవామి – క్రియ, 9. దివి – **దివి**, దివోః, ద్యుషు; హకారాన్త స్త్రీలింగ 'దివ్' శబ్దము. స.ఏ, 10. చతురైః – చతురేణ, చతురాభ్యామ్, **చతురైః**; అకారాన్త పుంలింగ చతుర శబ్దము. తృ.బ, 11. సురకామినీజనైః – సురకామనీజనేన – సురకామినీజనాభ్యామ్, సురకామినీ జనైః; అకారాన్త పుంలింగ సురకామినీజన శబ్దము. తృ.బ, 12. యావత్, న – అవ్యయాలు, 13. విలోభ్యసే – వి + లుభ్ (కర్మణి) లట్ – మ.ఏ.

**సమాసాలు :–**

1. పతఙ్గవర్త్మనా – పతఙ్గస్య వర్త్మ (ష.త) పతఙ్గవర్త్మ, తేన।
2. అఙ్కాశ్రయణీ – అఙ్కమ్ ఆశ్రయతీతి (ఉపపద తత్పురుష) సా।
3. సురకామినీజనైః – సురాణాం కామిన్యః (ష.త) సురకామిన్యః చ తే జనాః (కర్మధా.) తైః।

**సంధులు :–**

1. పునః + అఙ్కాశ్రయణీ – పునరఙ్కాశ్రయణీ – విసర్గసంధిః (రుత్వమ్)।
2. చతురైః + సురకామినీజనైః చతురైస్సురకామినీజనైః – విసర్గసంధిః।
3. యావత్ + న – యావన్న – అనునాసికసన్ధిః – **యరః అనునాసికే అనునాసికో వా (సూ.8-4-44)** – రహలు తప్ప తక్కిన పదాంతమందలి హల్లులకు (యర్రులకు) అనునాసికవర్ణము పరముగా నున్నచో ఆయా వర్గలకు సంబంధించిన అనునాసిక (ఙ మ ఙ ణ న) వర్ణమాదేశముగ వికల్పముగ వచ్చును.

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. పతఙ్గః –**

ఎ) (పుం) పతేరఙ్గచ్పక్షిణి – ఇతి అఙ్గచ్ (సూ. 1-116)।





బి) పత్ఌ గతౌ భ్వాది / పరస్మైపదీ + సేట్ + అఙ్గచ్।

సి) పతతి గచ్ఛతీతి పతఙ్గః।

డి) 'పతఙ్గః శలభే **చాగ్నౌ** మార్జారేఽర్కే శరే ఖగే' ఇతి **వైజయన్తీ**

ఇ) 1. పతఙ్గః శలభే శాలి ప్రభేదే పక్షి సూర్యయోః', ఇతి మేదినీ, శాశ్వతః।

2. 'పతఙ్గః శలభే శాలిప్రభేదే విహగే రవౌ,' ఇతి విశ్వకోశః

– అని నానార్థసంగ్రహము పేర్కొన్నది.

ఎఫ్) శ్లో॥ కామస్తు బాణావసరం ప్రతీక్ష్య
పతఙ్గవద్వహ్నిముఖం వివిక్షుః ।
ఉమాసమక్షం హరబద్ధలక్ష్య –
శ్శరాసనజ్యాం ముహురామమర్శ ॥ కు. సం. 3-64

**క్రియాదర్శము :–**

1. **భవామి** – భూ – సత్తాయామ్ (ఉండుట) అకర్మకమ్, సేట్, పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్ (1). ఉత్తమపురుషైకవచనాంతః।

రూపాలు:– **భవామి** – భవావః – భవామః

భవామి సంప్రత్యేవ భవిష్యామి – 'వర్తమానసామీప్యే వర్తమానవద్వా' ఇతి లట్.

**2. విలోభ్యసే** – 2. వి – ఉపసర్గ, లుభ (లుభ్) విమోహనే (ఆశపడుట) సకర్మకమ్, సేట్, పరస్మైపదీ, కర్మణిప్రయోగము

విలోభ్యసే విలోభయిష్యసే – 'యావత్పురా నిపాతయోర్లట్. ఇతి లట్.

---

**శ్లో॥ 'మదనేన వినాకృతా రతిః
క్షణమాత్రం కిల జీవితే'తి మే।
వచనీయమిదం వ్యవస్థితం
రమణ! త్వామనుయామి యద్యపి॥ 21**

**పదవిభాగము** :– మదనేన, వినాకృతా, రతిః, క్షణమాత్రమ్, కిల, జీవితా, ఇతి, మే, వచనీయమ్, ఇదమ్, వ్యవస్థితమ్, రమణ! త్వామ్, అనుయామి, యది, అపి।

**అన్వయక్రమము** :– రమణ! త్వామ్ అనుయామి యద్యపి, రతిః మదనేన వినాకృతా క్షణమాత్రం జీవితా కిల ఇతి ఇదం వచనీయం మే వ్యవస్థితమ్।

**ప్రతిపదార్థము** :– హే రమణ! – ఓ మనోహరుడా!, త్వామ్ – నిన్ను, అనుయామి యద్యపి – అనుసరించినప్పటికిని, రతిః – రతిదేవి, మదనేన – మన్మథునితో, వినాకృతా – విరహితురాలై, క్షణమాత్రమ్ – నిముషకాలము, జీవితా కిల – బ్రతికి యుండినది గదా, ఇతి – అనెడి, ఇదమ్ – ఈ, వచనీయమ్ – మాట(నింద), మే – నాకు, వ్యవస్థితమ్ – స్థిరము.

**తాత్పర్యము** :– ఓ మనోహరుడా! నిన్ను అనుసరించి వచ్చినప్పటికిని 'రతిదేవి మన్మథునితో విరహితురాలై క్షణకాలము బ్రతికియుండినది గదా' అనెడి యీ మాట(నింద) నాకు స్థిరము.

**పాఠాన్తరాలు :–** జీవితేతి – జీవతీతి

**విభక్తులు / క్రియలు** :– 1. రమణ – **హే రమణ!** హే రమణౌ, హే రమణాః; అకారాన్త పుంలింగ రమణ శబ్దము. సంబోధన ప్రథమావిభక్తి ఏకవచనము, 2. త్వామ్ – **త్వామ్,** యువామ్, యుష్మాన్; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము. ద్వి.ఏ, 3. అనుయామి – క్రియ – అను – ఉపసర్గ, యా – ప్రాపణే (వెళ్లుట), 4. యది, అపి – అవ్యయములు, 5. రతిః – **రతిః**, రతీ, రతయః; ఇకారాన్త స్త్రీలింగ రతిశబ్దము. ప్ర.ఏ, 6. మదనేన – **మదనేన**, మదనాభ్యామ్, మదనైః; అకారాన్త పుంలింగ మదనశబ్దము. తృ.ఏ, 7. వినాకృతా – **వినాకృతా**, వినాకృతే, వినాకృతాః; అకారాన్త స్త్రీలింగ వినాకృతా శబ్దము. ద్వి.ఏ, 8. క్షణమాత్రమ్ – అవ్యయము 9. జీవితా – **జీవితా**, జీవితే, జీవితాః; ఆకారాన్త స్త్రీలింగ జీవితాశబ్దము. ప్ర.ఏ, 10. కిల, ఇతి – అవ్యయాలు, 11. ఇదమ్ – **ఇదమ్**, ఇమే, ఇమాని; మకారాన్త నపుంసకలింగ 'ఇదమ్' శబ్దము. ప్ర.ఏ, 12. వచనీయమ్ – **వచనీయమ్**, వచనీయే, వచనీయాని; అకారాన్త నపుంసకలింగ వచనీయ శబ్దము. ప్ర.ఏ, 13. మే – **మే**, నౌ, నః దకారాన్త పుంలింగ అస్మచ్ఛబ్దము. ష.ఏ, 14. వ్యవస్థితమ్ – **వ్యవస్థితమ్**, వ్యవస్థితే, వ్యవస్థితాని; అకారాన్త నపుంసకలింగ వ్యవస్థిత శబ్దము. ప్ర.ఏ

**సమాసాలు:–**

1. వినాకృతా – వినా కృతా (సుప్సుపా సమాసః)।
2. క్షణమాత్రమ్ – క్షణ ఏవ మాత్రమ్ క్షణమాత్రమ్ నిత్యసమాసః।
3. వ్యవస్థితమ్ – వి అవస్థితమ్ (సుప్సుపాసమాసః)।

**సంధులు :–**

1. జీవితా + ఇతి – జీవితేతి (గుణసన్ధిః)।
2. యది + అపి – యద్యపి (యణాదేశసన్ధిః)।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. రమణః**

ఎ) (పుం) రమతే రమయతి వా। రమ్ ణిచ్ వా, ల్యు, ల్యుట్, పతిః।



బి) రమయతి స్త్రీ పురుషాణామన్తఃకరణమితి । కామదేవః।

సి) శ్లో।। నానామలప్రస్రవణైర్నానాకన్దరసానుభిః।
రమణం విహరన్తీనాం **రమణైః** సిద్ధయోషితామ్ ।।
– శ్రీమద్భాగవతము 4–6–11

"... సుందరమగు గుహలయందు సౌందర్యవతులగు సిద్ధపత్నులు గోచరింతురు"

డి) శ్లో।। కాన్తః స్యాత్కమితా పతిర్వరయితా భర్తా చ భోక్తా ధవో
రుచ్యాభీకవరాభికాశ్చ **రమణః** ప్రాణాధినాథోనుగః ।

అని 'రమణ' శబ్దమునకు 14 నామములను **హలాయుధకోశము** పేర్కొన్నది.

ఇ) 'రమణం స్యాత్పటోలస్యమూలేఽపి **రమణః** ప్రియే' అని **విశ్వకోశము**

ఎఫ్) శ్లో।। తామఙ్కమారోప్య కృశాఙ్గయష్టిం
వర్ణాన్తరాక్రాన్తపయోధరాగ్రామ్।
విలజ్జమానాం రహసి ప్రతీతః
పప్రచ్ఛ రామాం **రమణో**ఽభిలాషమ్।। – ర.వం. 14–27

"రమణః రామామ్ అభిలాషం పప్రచ్ఛ" ఇది ద్వికర్మక కర్తరి ప్రయోగము. ఈ రామా రమణ శబ్దములు సీతారాముల యనురాగమును తెలుపుచున్నవి. అని కేశవపంతుల నరసింహశాస్త్రిగారు.

**క్రియాదర్శము :– అనుయామి** – అను – ఉపసర్గ. యా – ప్రాపణే (పొందుట, వెళ్లుట) సకర్మకమ్, అనిట్, పరస్మైపదీ, అదాది ప్రకరణమ్ (2), లట్, ఉత్తమ పురుషైకవచనము, **రూపాలు:– యామి** – యావః – యామః

---

**శ్లో।। క్రియతాం కథమన్త్యమణ్డనం**
**పరలోకాన్తరితస్య తే మయా।**
**సమమేవ గతోఽస్యతర్కితాం**
**గతిమఙ్గేన చ జీవితేన చ।। 22**

**పదవిభాగము :–** క్రియతామ్, కథమ్, అన్త్యమణ్డనమ్, పరలోకాన్తరితస్య, తే, మయా, సమమ్, ఏవ, గతః, అసి, అతర్కితామ్, గతిమ్, అఙ్గేన, చ, జీవితేన, చ।

**అన్వయక్రమము :–** పరలోకాన్తరితస్య తే మయా అన్త్యమణ్డనం కథం క్రియతామ్? అఙ్గేన జీవితేన చ సమమ్ ఏవ అతర్కితాం గతిం గతః అసి।

**ప్రతిపదార్థము :-** పరలోకాన్తరితస్య - స్వర్గమందు వ్యవహితుడవైయున్న, తే - నీకు, మయా - నాచేత, అన్యమణ్డనమ్ - కడపటి అలంకారము, కథమ్ - ఎట్లు, క్రియతామ్ - చేయబడును, అఙ్గేన చ - దేహముతోడను, జీవితేన చ - జీవముతోడను, సమమ్ ఏవ - కూడనే, అతర్కితామ్ - ఊహింపబడని, గతిమ్ - దశను, గతః - పొందినవాడవు, అసి - అయితివి.

**తాత్పర్యము :-** స్వర్గమందు వ్యవహితుడవై యున్న నీకు నాచేత కడపటి అలంకారము ఎట్లు చేయబడును? జీవముతోబాటు దేహముకూడా ఊహింపబడని దశను పొందినవాడవయితివి.

**పాఠాన్తరాలు :-** పరలోకాన్తరితస్య - పరలోకత్వరితస్య

**విభక్తులు / క్రియలు:-** 1. క్రియతామ్ - క్రియ, 2. తే - **తే**, వామ్, వః; దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము. ష.ఏ, 3. మయా - **మయా**, ఆవాభ్యామ్, అస్మాభిః; దకారాన్త పుంలింగ 'అస్మ'చ్ఛబ్దము తృ.ఏ, 4. అన్యమణ్డనమ్ - **అన్యమణ్డనమ్**, అన్యమణ్డనే, అన్యమణ్డనాని; అకారాన్త నపుంసకలింగ అన్యమణ్డన శబ్దము. ప్ర.ఏ, 5. కథమ్, చ, ఏవ - అవ్యయాలు, 6. అఙ్గేన - **అఙ్గేన**, అఙ్గాభ్యామ్, అఙ్గైః ; అకారాన్త నపుంసకలింగ 'అంగ' శబ్దము. తృ.ఏ, 7. జీవితేన - **జీవితేన**, జీవితాభ్యామ్, జీవితైః; అకారాన్త నపుంసకలింగ 'జీవిత'శబ్దము. తృ.ఏ, 8. సమమ్ - అవ్యయము, 9. అతర్కితామ్ - **అతర్కితామ్**, అతర్కితే, అతర్కితాః; ఆకారాన్త స్త్రీలింగ అతర్కితాశబ్దము. ద్వి.ఏ, 10. గతిమ్ - **గతిమ్**, గతీ, గతీః; ఇకారాన్త స్త్రీలింగ గతి శబ్దము. ద్వి.ఏ , గమ్ + క్తిన్, 11. గతః - **గతః**, గతౌ, గతాః; అకారాన్త పుంలింగ గత శబ్దము. ప్ర.ఏ, 12. అసి - క్రియ, 13. పరలోకాన్తరితస్య ... **అన్తరితస్య**... ,అన్తరితయోః..., అన్తరితానామ్; అకారాన్త పుంలింగ... అన్తరితశబ్దము. ష.ఏ.

**సమాసాలు :-**

1. పరలోకాన్తరితస్య - పరశ్చ అసౌ లోకః (కర్మధా.) పరలోకః, పరలోకేన అన్తరితః (తృ.త), తస్య।
2. అన్యమణ్డనమ్ - అన్త్యం చ తత్ మణ్డనమ్ (కర్మధా)।
3. అతర్కితామ్ - న తర్కితా (నఞ్తత్పు) అతర్కితా, తామ్।

**సంధులు :-**

1. గతః + అసి - గతోఽసి - ఉత్వాదేశః।

అప్లుతమగు హ్రస్వ అకారమునకు పరముగానున్న రుత్వమునకు అప్లుతమైన హ్రస్వ అకారము పరముగానున్నప్పుడు ఉకారము వచ్చును. **అతోరో రప్లుతాదప్లుతే** । (సూ 6-1-109) స్వాదిసన్ధిః।

2. అసి + అతర్కితామ్ - అస్యతర్కితామ్ - యణాదేశసన్ధిః।



3. గతోఽస్యతర్కితామ్ (1 + 2)

**పదవ్యుత్పత్తి - నిఘంటుప్రమాణాలు - కావ్యప్రయోగాలు:-**

**1) గతిః -** ఎ) (స్త్రీ.) గమ్ భావే క్తిన్ । గమనకర్మ।

బి) కర్మవిపాకేఽపి దశాగతీ స్మృతే ... అని హలాయుధకోశము

సి) శ్లో।। గతిర్భర్తా ప్రభుః సాక్షీ నివాసః శరణం సుహృత్ ।
ప్రభవః ప్రలయః స్థానం నిధానం బీజమవ్యయమ్।।
- భగవద్గీత-9-18

శ్లో।। అయతిః శ్రద్ధయోపేతో యోగాచ్చలితమానసః।
అప్రాప్యయోగసంసిద్ధిం కాం గతిం కృష్ణ గచ్ఛతి।।
- భగవద్గీత-6-37

'ఓ కృష్ణా! యోగమునందు శ్రద్ధాదరములతో యోగసాధన చేయుచు మనస్సు వశమునందుండు కారణమున అవసానదశలో మనస్సు చలించి, యోగసిద్ధిని పొందకయే మరణించిన సాధకుని గతి యేమగును.'

డి) మరిన్ని వివరములకు 'హలాయుధకోశవ్యాఖ్య' చూడగలరు.

**క్రియాదర్శము :-**

1. క్రియతామ్ - కర్మణి ప్రయోగము. లోట్ ప్రథమపురుషైకవచనము.
డుకృఞ్ - కరణే, తనాదయః, సకర్మకమ్, అనిట్, (ఉభయపదీ)

**రూపాలు - క్రియతామ్** - క్రియేతామ్ - క్రియన్తామ్ - ఆత్మనేపదీ
(సకర్మక ధాతువులపై కర్మార్థమున, అకర్మక ధాతువులపై భావార్థమున లడాదులు వచ్చును. తిఙన్త స్థలములో **'సాధ్యావస్థాపన్నః ధాత్వర్థః భావః'** సాధ్యావస్థలోనున్న క్రియ భావమనబడును. భావకర్మార్థక లకారములు ఆత్మనేపదము నందే ఉండును. భావార్థమున ప్రథమైకవచనము మాత్రమే ఉండును. కర్మార్థమున అన్ని వచనములు ఉండును. చూ. సంస్కృతవ్యాకరణమ్ - భావకర్మప్రకరణమ్.

---

**శ్లో।। ఋజుతాం నయతః స్మరామి తే**
**శరముత్సఙ్గనిషణ్ణధన్వనః ।**
**మధునా సహ సస్మితాం కథాం**
**నయనోపాన్తవిలోకితం చ యత్ ।। 23**

**పదవిభాగము :–** ఋజుతామ్, నయతః, స్మరామి, తే, శరమ్, ఉత్సఙ్గనిషణ్ణ ధన్వనః, మధునా, సహ, సస్మితామ్, కథామ్, నయనోపాన్తవిలోకితమ్, చ, యత్।

**అన్వయక్రమము :–** శరమ్ ఋజుతాం నయతః ఉత్సఙ్గనిషణ్ణధన్వనః తే మధునా సహ సస్మితాం కథాం యత్ నయనోపాన్తవిలోకితం చ స్మరామి।

**ప్రతిపదార్థము :–** (హే ప్రియ! ఓ నాథుడా!), శరమ్ – బాణమును, ఋజుతామ్ – తిన్నగానగుటను (వక్రత లేకుండుటను), నయతః – పొందించుచున్నవాడవైన ఉత్సఙ్గనిషణ్ణధన్వనః – ఒడియందు ఉంచబడిన బాణము గలవాడవై, తే – నీయొక్క మధునా సహ – వసంతునితో కూడ, సస్మితామ్ – చిఱునగవుతో కూడిన, కథామ్ – సంభాషణమును, నయనోపాన్తవిలోకితమ్ – కన్నులయొక్క కడల చెంత నుండి చూచుటను,యత్ చ – ఏది హేతువో దానిని, స్మరామి – తలచుకొనుచున్నాను

**తాత్పర్యము :–** (ఓ నాథుడా!) బాణమును వక్రతలేకుండునట్లు పొందించు చున్నవాడవై ఒడియందు బాణము ఉంచబడిన వాడవైన నీ వసంతునితో చిఱునగవుతో కూడిన సంభాషణమును, కన్నులయొక్క కడల చెంత నుండి (నన్ను) చూచుటను ఏది హేతువో దానిని తలచుకొనుచున్నాను.

**పాఠాన్తరాలు :–** 1. నిషణ్ణ – నిషఙ్గ, నిషక్త; 2. విలోకితం చ యత్ – విలోకితాని చ; 3. యత్ – తత్।

**విభక్తులు / క్రియలు:–** 1. హే ప్రియ! – **హే ప్రియ!**, హే ప్రియౌ, హే ప్రియాః; అకారాన్త పుంలింగ ప్రియశబ్దము. సంబోధన ప్ర.ఏ., 2. శరమ్ – **శరమ్**, శరౌ, శరాన్; అకారాన్త పుంలింగ శరశబ్దము. ద్వి.ఏ, 3. ఋజుతామ్ – **ఋజుతామ్**, ఋజుతే, ఋజుతాః; ఆకారాన్త స్త్రీలింగ ఋజుతా శబ్దము ద్వి.ఏ, 4. నయతః – **నయతః**, నయతోః, నయతామ్, శత్రన్తోఽభ్యస్త సంజ్ఞకో 'నయత్' శబ్దః, ష.ఏ, 5. ఉత్సఙ్గనిషణ్ణధన్వనః ...**ధన్వనః**...ధన్వనోః, ధన్వనామ్; నకారాన్త పుంలింగ ...ధన్వన్ శబ్దము. ష.ఏ, 6. తే – **తే**, వామ్, వః – దకారాన్త పుంలింగ యుష్మచ్ఛబ్దము. ష.ఏ, 7. మధునా – **మధునా,** మధుభ్యామ్, మధుభిః; ఉకారాన్త పుంలింగ మధుశబ్దము. తృ.ఏ, 8. సహ, చ – అవ్యయాలు, 9. సస్మితామ్ – **సస్మితామ్**, సస్మితే, సస్మితాః; ఆకారాన్త స్త్రీలింగ 'సస్మితా' శబ్దము. ద్వి.ఏ, 10. కథామ్ – **కథామ్,** కథే, కథాః; ఆకారాన్త స్త్రీలింగ కథా శబ్దము. ద్వి.ఏ, 11. నయనోపాన్తవిలోకితమ్, ... **విలోకితమ్**, ...విలోకితే,... విలోకితాని; అకారాన్త నపుంసకలింగ ... విలోకిత శబ్దము. ద్వి.ఏ, 12. యత్ – అవ్యయము, 13. స్మరామి – క్రియ.

**సమాసాలు :–**

1. ఉత్సఙ్గనిషణ్ణధన్వనః – ఉత్సఙ్గే నిషణ్ణం (స.త) ఉత్సఙ్గనిషణ్ణమ్, ఉత్సఙ్గనిషణ్ణం ధనుర్యస్య (బహువ్రీహి) సః, తస్య।





2. సస్మితామ్ – స్మితేన సహితా (బహువ్రీహి) సస్మితా, తామ్ ।
3. నయనోపాన్తవిలోకితమ్ – నయనోః ఉపాన్తౌ (ష.త) నయనోపాన్తౌ నయనోపాన్తాభ్యాం విలోకితమ్ (తృ.త) నయనోపాన్తవిలోకితమ్।

**పదవ్యుత్పత్తి – నిఘంటుప్రమాణాలు – కావ్యప్రయోగాలు:–**

**1. ప్రియః (11వ శ్లోకమునకు – అనుసంధానము)**

ఎ) (త్రి) ప్రీణాతీతి, ప్రీ 'ఇగుపధజ్ఞాప్రీకిరః కః' ఇతి క (సూ (3–1–135) – కృదన్తప్రకరణమ్। హృద్యః

బి) శ్లో॥ సత్యం బ్రూయాత్ ప్రియం బ్రూయాన్న బ్రూయాత్ సత్యమప్రియమ్।
ప్రియం చ నానృతం బ్రూయాదేష ధర్మః సనాతనః ॥
– ఇతి మహాభారతే

సి) (పుం) భర్తా

శ్లో॥ ప్రణమతి పశ్యతి చుమ్బతి సంశ్లిష్యతి పులకముకులితైరఙ్గైః ।
ప్రియసఙ్గాయ స్ఫురితాం వియోగినీ వామబాహులతామ్ ।
– ఇతి ఆర్యాసప్తశత్యామ్ –347

శ్లో॥ వీచిక్షోభస్తనితవిహగశ్రేణికాంచీగుణాయాః
సంసర్పన్త్యాః స్ఖలితసుభగం దర్శితావర్తనాభేః ।
నిర్విన్ధ్యాయాః పథిభవ రసాభ్యన్తరః సన్నిపత్య
స్త్రీణామాద్యం ప్రణయవచనం విభ్రమో హి **ప్రియేషు॥**
– మేఘదూతమ్ – 28

'... ప్రమదలకు ప్రియులయందు విలాసము మొదటిదగు ప్రణయవాక్యముగదా!'

శ్లో॥ తథా సమక్షం దహతా మనోభవం
పినాకినా భగ్నమనోరథా సతీ।
నినిన్ద రూపం హృదయేన పార్వతీ
**ప్రియేషు** సౌభాగ్యఫలా హి చారుతా॥ – కు. సం. 5–1

"... స్త్రీల సౌందర్యమునకు భర్తల యనురాగమే గదా ప్రయోజనము"

**క్రియాదర్శము:– స్మరామి –** స్మృ – చిన్తాయామ్ (స్మరించుట), సకర్మకమ్, అనిట్ పరస్మైపదీ, భ్వాదిప్రకరణమ్, లట్ – ఉత్తమపురుషైకవచనము.

రూపాలు:– – **స్మరామి –** స్మరావః – స్మరామః

---

